శ్రీ గురవే నమః.

# స్వప్న శివపాలిత

ఆంగ్లమహాకవి, షేక్స్పియర్ విరచితమగు
'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్' అను నాటకమున
కాంధ్రీకరణము.




గ్రంథకర్త
మిహిరాంధ్రభారతీ ప్రభృతి బహుగ్రంథకర్తయు,
హైదరాబాద్‌లోని నిజామ్ కాలేజియందుఁ
బ్రధాన సంస్కృతాంధ్రోపాధ్యాయులుగ నుండి
పరిష్కృత ముపకారవేతనముం బడయు
రాయప్రోలు వేంకటరామసోమయాజులు,
గుంటూరు.





మొదటి కూర్పు.





గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

1936




[ వెల 0-12-0.

# ఈనాటకమునందలి పాత్రలు.



## —* పురుషులు *—

తేజేశుఁడు — Theseus

అజాజుఁడు — Egeus

లవణచంద్రుఁడు — Lysander

ధామాత్రేయుఁడు — Demetrius

ఫిలాసత్రాత — Philostrate

కిమ్మ్రయుఁడు — Quince

శిశునాగుఁడు — Snug

భూతబుద్ధి — Bottom

ప్లుతుఁడు — Flute

చణాటుఁడు — Snout

తారాలింగుఁడు — Starveling

## —* స్త్రీలు *—

శివపాలిత — Hippolyta

హీరిమయి — Hermia

హేలిని — Helena

## —* భూతతతి *—

భైరవుఁడు — Oberon

తిరిధన్య — Titania

పుష్కరుఁడు — Puck

భూతపరివారము — Cobweb etc.

తేజేశశివపాలితాపరివారము,

శ్రీశివాయ గురవే నమః

# పీఠిక

—:o:—

సకలదేశప్రసిద్ధిఁ గాంచిన విలియం షేక్స్పియర్మహాకవి గ్రేట్ బ్రిటన్ ద్వీపములోని దక్షిణభాగ మగునింగ్లండులో "ఆవన్"నదీతీరమందుండు "స్ట్రాట్ఫర్డ్" పట్టణమున 23 వ ఏప్రిల్ నాఁడు 1564 క్రీ॥ శ॥ సంవత్సరమున జన్మించెను. వాణిజ్యమునం జేరందిన జాన్ షేక్స్పియ రనుతండ్రిగా రితని నాగ్రామమందలి గ్రామపాఠశాలలోఁ జేర్చి, వారిఖండపు సనాతనభాష లగుగ్రీకు లాటిన్ భాషలలోఁ గొంతవఱకు సూక్ష్మపరిచయము కలుగునట్లు చదివించిరి. ఈతండ్రిగారికిఁ గొన్నియిక్కట్టులు రాఁగాఁ, గుమారునివిద్యాభ్యాసవిషయమునఁ బ్రతిబంధములు మిక్కిలిగఁ గలిగెను. బడిచదువును జాలింపవలసివచ్చినను, విలియంషేక్స్పియర్గా రూరకుండక యనేకవిషయములందు విజ్ఞానమును సంపాదించుచుఁ గాలమును గడపుచుండ వీరితండ్రిగారు గతించిరి. ఏదో నైతిక లోపదోషముచేత వీరు స్వగ్రామమును వదలి లండన్ మహానగరముం జేరవలసివచ్చెను. ఈమహానగరమునం గొంతకాలముండి తాత్కాలికదేశపరిస్థితులగూర్చి కొంతయనుభవజ్ఞానమును సాధించి, ఎట్లో మహాకష్టములతోఁ బొట్టపోసికొనుచుఁ

గొంతమందినాటకకర్తలతోను నటకులతోను బరిచయమును సాధించి, తానుగూడఁ బాత్రలను స్వీకరించుచు నటకవృత్తిని స్వీకరించెను; కొద్దిదినములలోనే తానుగూడ నాటకరచనకుం బూనుకొనెను. ఇంతటితో నతనికష్టదశ యస్తమించి యదృష్ట సూర్యుఁ డుదయించెను. మొదట నీకవి పరులు రచియించిన నాటకములకు మెఱుంగులిడుచుఁ బ్రసిద్ధిగాంచుచుండి, పిదప స్వతంత్రముగఁ దానే నూతననాటకముల రచియించి ప్రఖ్యాతికెక్కసాగెను.

మొత్తముమీఁద ముప్పదియాఱునాటకముల నీమహాకవి రచియించి తనసాంఘికతత్త్వరహస్యానుభవజ్ఞానకలశపాథోరాశిని మథియించి మథియించి చదువరులకు నమూల్యములగునీతులను బూర్ణానుభవజ్ఞానమును వెన్నం జిలికియిచ్చినట్లు దయచేయుచుండును. ఈమహాకవి రచియించిన నాటకములను విమర్శకులు నాలుగుతరగతులుగఁ దత్తత్కాలపరిపాకవిజ్ఞానపరిణామతారతమ్యములంబట్టి విభజించుచున్నారు.

మొదటితరగతివి:- ఆఱవహెన్రీ మూఁడుభాగములు
ఘోరపాట్లప్రహసనము
వెరోనానగరపు టిద్దఱుపెద్దలు.
"స్వప్నశివపాలిత" యని నేనాంధ్రీకరించిన "నట్టెండకాలపురాత్రి స్వప్నము.

రెండవతరగతివి:- రామియోజూలియట్లు
మూఁడవ రిచర్డు
రెండవ రిచర్డు
జాన్ రాజు
వణిజ్నగరవర్తకుఁడు మొదలగునవి 3

మూఁడవతరగతివి:- అయిదవ హెన్రి
నీవు కోరినట్లే
వ్యర్థవృథాయాసము
పండ్రెండవ రాత్రి
జూల్యస్ సీజరు : హామ్లెట్.

నాల్గవతరగతివి:- ఒథెల్లో
లీయర్ప్రభువు
మాక్బెత్
"కార్యలీనుఁడని" నేను దెనిఁగించిన "కార్యలానస్"
సింబలీన్
"మిహిరాండభారతి"యని నేనాంధ్రీకరించిన చలికాలపుంగథ. "టెంపెస్టు"

ఈ "స్వప్నశివపాలిత" యనునాటకముంగూర్చి యనేకాంగ్లవిమర్శకులు మొదటితరగతినాటకములలో నగ్రగణ్యమిదియేయని యభిప్రాయమిచ్చుచున్నారు. మనరూపకోపరూపకలక్షణములకును, ఆంగ్లభాషలోని నాటకములకును, లక్ష్యలక్షణసమన్వయముచేయుట కష్టము. దీనిని నాటికయనుటయే

యుక్తమని నాతలంపు. కాని, మనరూపకతత్త్వమీమాంస లోని పంచసంధులవంటి సంధులే షేక్స్పియర్మహాకవినాటకములలోఁగానఁబడుచున్నవి. వివిధమానవవ్యక్తులమనోవృత్తుల యావిర్భావతిరోభావములంగూర్చి వర్ణించుటలో నీమహాకవిని మించినమహాకవి వారిపాశ్చాత్యఖండములందు లేఁడని నొక్కిచెప్పవచ్చును. మనకాళిదాసకవికూడ మఱికొన్ని నాటకములను రచియింపకపోవుట లోటైనను, వీరిశాకుంతలమును మించిననాటకరాజ మీలోకమునలేదని జర్మనీదేశపు "గతే" యనుమహావిమర్శకుఁడు వర్ణించియున్నాఁడు. పాశ్చాత్యులషేక్స్పియర్మహాకవికి సాటి షేక్స్పియరే; మనకాళిదాసునకు సాటి కాళిదాసే, వీరుభయులును సాటిలేని మేటికవులే.

ఈషేక్స్పియర్మహాకవి రచియించిననాటకములలో మూఁడునాటకముల నేరి యాంధ్రీకరించి యాంధ్రభాషాయోషామణికి నీకుసుమత్రయమును యథాశక్తిగ భక్తితో సమర్పించినాఁడను. విమర్శకులు నాలోపములకుం గోపముంజూపక సరసమార్గదర్శకులై తమహెచ్చరికలం దెలియఁజేసినచో మిక్కిలి కృతజ్ఞతతో దిద్దుబాట్లను జేయఁగలవాఁడను.

బుధజనవిధేయుఁడు,

రాయప్రోలు వేంకటరామసోమయాజులు.



# స్వప్న శివపాలిత



## —* నాంది *—



ఉ. జ్ఞానము జీవులం దొకటె
జాగ్రదవస్థ, గలన్, సుషుప్తిలో
లీనగతిన్, వెలుంగ బహు
లీకృతసర్వజగత్ప్రకల్పనన్
దానె ప్రవిష్టమై యఖిల
తత్త్వములం దనసత్తఁ జూపుచున్
భానుగతిన్ స్వభక్తజన
భావతమస్సులఁ బాఱఁదోలునా
మీనముఖాకృతుల్ గొనుచు
మేదినిఁ గాచుసుఖాత్ముఁ గొల్చెదన్ !

# ప్ర స్తా వ న.

—:o:—

( సూత్రధారుఁడు, మారిషుఁడు ప్రవేశింతురు. )

సూత్ర:- మారిషా ! సరసతములగు ప్రేక్షకులు వేలకొలఁది సమావేశమైనపు డిట్లు జాగుచేయఁదగునా !

మారిషుఁడు:- ప్రదర్శనప్రయత్నములందే మునిఁగి తేలుచు మనవారలచే లోపలనాయాకార్యకలాపముల సాగింప బ్రయత్నించుచుండ మీపిలుపు విని యిదె వచ్చితిని.

సూత్ర:- కాలముయొక్కవిలువ నెఱుంగనిమానవుఁ డీకాలమున నెక్కడనైన నుండునా ? శాంతికందమై మందతరముగఁ గాన్పించు మనభారతవర్షమునందుఁ గూడఁ బాశ్చాత్యలోకానుభూత మగుచున్నసమస్త యంత్రతంత్రసంపృష్ట నిరంతర రజోగుణాటోపము కాన్పింపక తప్పదుగదా ! కావునఁ దమస్సువలనఁ గలుగునిద్రాలస్యాదులను వదలి చాకచక్యముం జూపుచుండవలయునుసుమీ !

మారి:- బావగా రీయుపన్యాసవుంబిచ్చితోఁ బ్రకృతముం గూడ మఱతురేమో ! కాలహరణమునకు మీరును గారణభూతులు కాక ప్రకృత మనుసరింపుఁడు.

సూత్రధా:- నాకే మేకా ? కానిమ్ము.

గీ. సాకు చిక్కినమాత్రాన సర్వజనులు
వాగుచుందురి విమర్శనల్ ; వావి కుదుర
సాగుచుండుట వింతయే ? సాధ్వసాధు
నిర్ణయం బిప్డు లోపించె నిశ్చితగతి !

మారి:- క్షమింపుఁడు ; తిరిగి కాలహరణ మేల ?

సూత్రి:- ఈనాటకమునకుమూలము మహాకవియగు షేక్స్పి యర్గారి "నట్టెండకాలంపురాత్రిస్వప్నంబు" కదా ? మనమెట్లో యీయాంధ్రీకృత మగునాటికను బ్రద ర్శింపఁబోవుచున్నారము ; లోపము లెన్నియో యుండవచ్చును. విమర్శకులు తమతమప్రకృతులకు నైజములగుభావములతో విమర్శించుటయు స్వభావ సిద్ధమే. జాగ్రదవస్థయు స్వప్నావస్థతోఁ దుల్యము నియే కొన్నిమతములందలిసిద్ధాంతముగదా ! మహా కవిగారు దీనికిం జేసిననామకరణము సరసతరమే. కాని, మనసామాజికులు స్వప్నములందుఁగూడ జాగ రూకతతోనే మెలంగవలయునని నాప్రార్థన. నాట కాదిరూపకోపరూపకములు చేయవలసినది నీతిబో ధనమే కావున నే నిట్లు హెచ్చరించుచున్నాఁడను.

ఈనాటికయొక్క పేరునకుఁ దగునట్లు గ్రీష్మర్తువును గుఱించియే గానముసాగింపుమని నటితో హెచ్చరించి రమ్ము.

మారి:- చిత్తము. (తెరలోనికిం బోవుచు. నటి పాడును)

విశాఖఁగూడుపున్నమలన్ వింతవెన్నెలన్
నిశార్థమందుఁ గల్గుసుఖము నిజ మఖండమౌన్
బ్రిశాంతి చిక్కు జనుల కపుడె, పగటివేడిమిన్
గృశించి సొక్కి సోలువారికిన్ సువర్గ మౌన్ !

సూత్రధా:- మీసోదరిగానముయొక్క మాధురీధురీణత యీసమస్తసామాజికుల హృదయకమలములను వికసింపఁజేసితీరుననియే నమ్మెద. శోభనముహూర్తము నకై యువ్విళ్ళూరుచున్న యీదేవేశునిహృదయము నాకర్షింప దెట్లు ?



శ్రీశారదాంబాయై నమః

# స్వప్నశివపాలిత



## ప్రథమాంకము



### —* మొదటిరంగము *—

[అర్ధనిశాపురి — దేవేశరాజమందిరము.]

(దేవేశుఁడు, శివపాలిత, విలాసత్రాత, ఇతరపరివారమును బ్రవేశింతురు.)

దేవేశుఁడు:- ప్రియతమా! శివపాలితా! నిర్ణయింపఁబడిన శోభనముహూర్తము మిగుల సమీపించుచున్నది; నేఁడు బహుళైకాదశి; నాలుగుదినముల కీముదుసలిచందమామ మాయమై క్రొత్తచంద్రరేఖ కాననగునుగదా! వయస్సు ముదిరినయీబక్కచందురుఁ డెంతమెల్లఁగాఁ జీమనడకలతో సాగుచున్నాఁడు! చవితితల్లిప్రతిబంధమువలెను, రాజమాతలు తమశిశువు లగురాజులకోశాంతర్గతధనసంచయమును గనఁబడనియట్లు మెల్లమెల్లగ నెట్లు వ్యయపఱుతురో యారీతిన, ఈచందమామ తనకళాధనక్షయముతో

నా భావోద్రేకమునకును క్షయరోగమును దెచ్చిపెట్టునా యేమి ?

శివపాలిత:- దేవేశా ! నాలుగుపగళ్లొక్కక్షణమహిమగా రాత్రి పరిణతింజెందిటీరును. ఆనాల్గురాత్రులును క్షణభంగుర మగునీముసలిమాసమును ముంచివైచు ; వెండి విల్లంబుఁబోలునీచలివెలుంగు కాలకాలుఁడు దివమునం గాత్రిల వంచి మించునట్లొప్పి శుభరాత్రి మేళతాళములను ఉలకింపరాఁగలఁడు. క్రొత్తమాసంపుసొంపు మనపత్తనంపు టెంపుసంపదం గనఁబోవు; తొందరయేల ?

దేవేశ:- పోయి, విలాసతాత్రితా! మననగరమునఁ దోరణాదులం గట్టించి జను లుత్సవోత్సాహు లగునట్లు చాటింపించుము. రాజ్యాంగశాఖాసభాస్థానములందు నేఁడు మొదలు శుభవిరతింగూర్చి ప్రకటింపించుము. చింతావిచారములు శ్మశానభూముల సంచరించుఁగాక ! యువతీయువకు లాది రసభరితు లగుదురుగాక !

(విలాసతాత్రిత నిష్క్రమించును.)

(శివపాలితతో) నీజోగినులగణములు పరాజితములైనను, నీ వపరాజితవే ! ఆజిం గించిద్బాధ నీకుం గల్గించిన వాఁడనై నీరాజ్యము నపహరించినను, నీవే నాప్రేమ నపహరించి, నాయర్ధాంగివి గా నంగీకరించితివి. ఈవివాహ మాసుర మెట్లగును ? 'గతం న చింతనీయ'మని పెద్ద లందురుగదా ! దానిని మఱచి యీయభినవజయోత్సవాది సంతోషమున సంతయు నీసొంతమే యనుకొనుము.

[అజజుఁడు, హ్రీమయి, లవచంద్రుఁడు, ధామాత్రేయుఁడును, ప్రవేశింతురు.]

అజజుఁడు:- జయము! జయము! దేవేశునకున్
జయము! యశః పరిపూర్ణవిభునకున్.

దేవేశుఁడు:- అజజమహాశయా! కృతజ్ఞుఁడన్;
ఇవె నమస్కృతుల్; విశేషము లేవో!

అజజుఁడు:- విసికి విసికి మీసన్నిధిఁ జేరితి;
పసికూనయ యీహ్రీమయి యయినన్
విసికించుటచే వెఱ్ఱెత్తినగతిఁ
గసిత్రోడఁ బితూరిసమత్తుమునన్
మనవిచేసిదన్ మన సిచ్చి వినుం
డనుఁగుఁగూఁతుపై నభియోగ మిదే!
(ధామాత్రేయునితో) ధామాత్రేయా! ధైర్యసురనగా!
శ్రీమద్ఘనగుణ! చేరుమ ప్రభునిన్,
కన్నియ నిచ్చితి ఘనునకు నితనికి
నెన్నియొ తరములపితరులు మెచ్చఁగ
(లవచంద్రునితో)
నిలు మిటఁ బ్రభుసన్నిధిని దయామయ!
(దేవేశునితో)
కలుషితచిత్తను గావించి, లవేం
దుఁడు దుడుకుతనం బొడుపును జూపఁగఁ
దొడఁగె నొడయఁడా! దూరుదు నేమం;
చొడఁబడుచున్నది చిన్నది యియ్యది;

కడుపునఁ బుట్టియుఁ గడు ననుఁగైనను
బెడఁదిరుగుట యీబిడ్డకుఁ దగు నెటు ?
మఱిపలుకుల కీమాయాకలితగ;
దుడుకునెత్తు రీదుడుకున నుండినఁ
బడఁదగుపాట్లివె ? పరకన్యలతో !
పాటలఁ బద్దెపుఁబలుకులఁ గులుకులఁ
జేటుగలుగ నీచేటిమనంబున్
సింగారపురససీధువుఁ జిమ్ముచు
సంగారవుమం టనఁదగుసంద్రము
లోపలఁ ద్రోసెను లొంగినకన్యక,
నీపలుగాకికి నిది తగు నెట్లో
మోహపుగురుతుల మోసపుమూర్పుల
గేహము నాదియు గీడ్పడఁజొచ్చెను,
వెన్నెలరాత్రులఁ గన్నులమూసినఁ
గన్నియ లేపుచు గదికిటికికడన్
మోసపుఁబాటల మోసపుమోహముఁ
గానులఁజిమ్మెట గండుమగఁటిమే !
కన్నెలమనసులో కడుసున్నితములు;
వన్నె లెఱుంగరు, వలలం బడుదురు,
మీ లెరవశమై మిడిసిపడెడిగతి;
వేలు వచింపం; జాలును జాలును
వింతలసొమ్ములు, వివిధవర్ణముల
నెంతో వసం దగుహీరపుటుంగ్రము,

లందపుమురుగులు హాటకశూన్యత
మందమతుల్గడు బొందలఁబడి మో
సముపడుగిల్లువి, చక్కని చూపుల
నిముసములోపల నిలువున ముంచెడి
సొమ్ములు, బొమ్మలు, కమ్మనితావుల
గుమ్మనఁ జల్లెడికుసుమపుగుత్తులు,
క్రొత్తమిఠాయిలు కూరలవంటలు,
ఇట్టిపదార్థము లెట్టులొ తెచ్చుచు
గట్టిగ నీనాపట్టిని ముంచెను
ఘోరతపస్వులుగూడ మనసు చెడి
జారినగతి మనచరితలె చెప్పఁగ
నభము శుభం బొకనాఁడు నెఱుంగని
యుభగమనల కిల నభయం బెట్లగు ?
వినయభయాదుల వేలకు నచ్చిన
మనకన్నియ లేమాటలు వినరిఁక;
పుట్టినదాదిగఁ బొట్టకుఁ దినకయు
యెట్టులొ గుట్టుగ నిక్కట్లకుఁ బా
ల్సేయక కాచినలేమలె వినరే
మాయకలిఁ గతి మన కిఁక నెట్లో
గానను; గరుణాఘన ! మనవిని వినుఁ
డీ, నగరపుధర్మేతరనూతన
మానవిహీనపుమనుగడ లొల్లము
గాన సనాతనకాలపుధర్మముఁ

బట్టియెఱుంగుఁడు; పడు చిది నాయది;
గట్టిగ దాతలపట్టె గెలువవలె.
చెల్లిన మాయీతల్లిదండ్రులదె
చెల్లఁగవలెఁ బల్కెల్లవిధములఁ
కన్నియ వినదేఁ గట్టిగఁ జట్టపు
మన్ననఁ గఠినపుమరణమె శరణము.
కనుకనె కన్యాఘనదానం బిల
మునుపు పదేండ్లకె మునులు విధించిరి.

దేవేశుఁడు : హ్రీమయి ! ఇఁక నీవేమన్నదువు ? తగ
లో మతిగతి నాలోచన చేయుము.
మాతయ దేవత ; మనసునఁ బిత నీ
భాతియ నమ్మట పరమపుధర్మము
మీయవె యీమీమించిన తేజముఁ
గాయము సూక్ష్మముఁ గడుముద్రిత మిలఁ
బితచేత నెగడ ! పిండము నిచ్చా
గతి మార్చుట కాపితకే తగు నిల
ధామాత్రేయుఁడు ధర్మసమృద్ధుఁడు
భామామణి ! యిఁకఁ బట్టును వదులుము.

హ్రీమయి:- లవచంద్రుఁడు నట్టివాఁడే.

దేవేశుఁడు:- ఆ. అతనియాత్మఘనత యట్టిదే కాఁదగు;
కాని, పితకు హితుఁడు కానికతన
లాఘవంబె కలుగు లవచంద్రునకు నిటఁ
గాన వదులు మింకఁ గంకపట్టు.

# ప్రథమాంకము

హ్రేమయి:- ఆ. నాన్నగారు నాదు నయనయుగంబునఁ
గన్న, మిన్న యితఁడె గాఁడొ యెన్న

దేవేశుఁడు:- కాదు; నీదు సొగసుఁ గన్నుల కీతండ్రి
వాదశక్తి, యనుభవములు వలయు.

హ్రేమయి:- ప్రభువర్యా! దయ నాదుప్రార్థన వినుఁడి
శుభదృష్టి మన్నించి సారిది లోపముల
ఏదివ్యశక్తిచే నీధైర్య మిపుడు
నాదుమనంబున నాటెనో యెఱుఁగ
లజ్జావతికి నిద్ది లగ్గొ యెగ్గొ యెఱుంగ
మజ్జనకునికడ మహితసన్నిధిన;
ఆతని నా త్రేయు నాత్మ మెచ్చదు; వినుఁ
డాతరి తుదిశిక్ష నానతీయుఁ డిఁక

దేవేశుఁడు:- మరణంబొ మనుజులమాటయె లేని
పరమనీచపుదీవిఁ బడవేయఁబడుటొ
మనరాజ్యశాసనాల్ మన్నింపవలయుఁ
గనికరింపఁగ వీలు కాన మిప్పట్ల.
కావున, సుందరీ! కామువశమున
నీ వుంట, హ్రేమయి! నిజ మిఁకఁ దగదు;
తర్కించి నెమ్మది ధైర్యముఁ బూని
కర్కశేచ్ఛాశక్తి ఖండించి, బుద్ధి
శక్తిచే నీస్థితి సత్త్వబలముల
యుక్తిచే గమనించి, యూనరక్తంపుఁ

డొందఱను సహించి, దూరంపుదృష్టి
ముందరఁ గాంచుమీ యిందునిభాస్య!
నీతండ్రియాజ్ఞల నిర్లక్ష్యదృష్టి
చేత నుల్లంఘించి చెడిపోదు వమ్మ!
సతతంబు యోగినీసాంగత్యమునను
బతిపేరి వినరానిబ్రహ్మచర్యమున,
సుతలఁ బుత్త్రిలఁ గాంచుసుఖము లేకుండఁ
ఱతిఁ జేరువఱ కిట్టిచిత్రికష్టంపు
జీవనంబును జూచి, ఛీ యన వాకొ ?
యావదాయుష్కాలయజనసంస్తుతుల
కేవెలుంగును జూచుకావిబట్టలను
నీవెప్డుఁ బూనంగ నిష్ఠయుఁ గలదె?
నిజము, త్రిశుద్ధిగ, నిర్మలచిత్త
భజమాన లగునట్టిభామలె ధన్య
లనవరతపుజీవయాత్ర నీరీతి
మనికి కష్టతమంబు మదియిచ్చి వినుము
వాడుక లేనట్టివనపుగులాబి
వాడి నశింప నెవ్వారికి మెచ్చు;
ఇహపరంబుల సంగ్రహించి మించినది
గృహలక్ష్మియై జాతికీర్తికి నండ.

శ్రీమయి:- మంచిది! నే నల్లె మహిఁ బెద్ద నగుచు
వంచితయోగినీవాటి జీవించి
పంచత్వ మొందెదఁ బ్రభువర! వినుఁడి

కొంచెమైనను నాదుకోర్కెని వదలి
మనసు మెచ్చనియిట్టిమానిసిఁ గూడి
కనుసన్న జీవించుగతికి నే నొప్ప.

దేవేశుఁడు:- పడకుము తొందరఁ బడతి నీ విట్లు;
వడి వచ్చునను వసవఱకిత్తు నవధి
ఆమెఱు నాఁడె మాహోవవివాహ
కామకేళియుఁ బండుగలు సాఁగు నిందు.
ఆనాఁడె నీనిశ్చయము తేలవలయుఁ
జోనాడి పట్టును బూర్వనిశ్చితుని
మీపిత తెచ్చినమేల్మిగుణాల
పాపను మెచ్చెదో? బహుకష్టవసతి
నిరతపుసన్న్యాసినివి యౌచుఁ దపముఁ
బరనిష్ఠతో ధ్యానభక్తి నిల్చెదవా?
పరమకష్ట మదంచు భావించి యెదను
నిరయంపుఁజావునె నిలిచి కోరెదవా?

ధామాత్రేయుఁడు:- (హ్రీమయితో) సుందరీ! హ్రీమయీ! పశ్చాత్తాప మొంది మీతండ్రిగారియాజ్ఞాపరిపాలనముఁ జేయుమీ.

లవచంద్రా! నీవెఱ్ఱిమొఱ్ఱిచేష్టలతోఱ్ఱిహక్కుల వదలి, ఈమె తండ్రిచే మనోదత్తమైనదిగాన మర్యాదల మన్నించి నాహక్కునకు నడ్డమురాకుము.

లవచంద్రుఁడు:— ధామా త్రేయా! నిన్నీమెతండ్రి వరించెఁ బో; నన్నామెయే వరించె. కోరి యాతండ్రినే పెండ్లాడుము.

అజజుఁడు:— హేయుతమా! లవచంద్రా! నీమోర్వలేని కూఁతలం గట్టిపెట్టుము. అతనిని నే మెచ్చినమాట నిజమే. నామెప్పునకుం దగుఫలము నాతఁడే యనుభవింపఁ గలఁడు. ఈకన్య నాకూఁతురుగాన నాయధీనమందలిది. కావున నీప్రభుసన్నిధిలోనే దీనిని ధామా త్రేయునివశము చేయుచున్నాఁడను.

లవచంద్రుఁడు:— ప్రభూ! ఆతఁ డెంతటియాభిజాత్యము కలవాఁడో, నేను నంతటియుత్తమవంశజ్ఞుఁడనే; ఆతఁ డెంత ధనసంపన్నుఁడో, నేను నంతటిధనవంతుఁడనే; కాని, నావల పాతనివలపును మించియున్నది; నాసంపద యాతని సంపత్తును మించకపోయినను, సమానమ యినఁ గావచ్చును. ఇన్నిటికంటె గొప్పవిశేష మేమనః ఆచిన్నది నన్ను మిన్నగఁ బ్రేమించుచున్నది. ఈసందర్భములలో నాహక్కు నేల నిల్పఁబెట్టుకొనరాదు? ధామా త్రేయునివిషయమున, ఆతనియెట్టయెదుటనే చెప్పఁగలను సుండీ, నిదానునికూఁతు రగుశీలినీదేవి నిదివఱకు వరించి యున్నాఁ డనుటయు, ఆమెయు నీతని మోహించిన దనుటయు, ఆతనియెదుటనే ప్రమాణపూర్వకముగఁ జెప్పఁగలను; ఆమె, పాపము! అమాయికురాలై యిప్పటికి నాతని నొకయర్చావతారముగా నెంచి, ఆతనిచంచలత్వ మెట్టిదైనను, అత్యద్భుతప్రేమతో వరించుచున్నది.

దేవేశుఁడు:— నే నీవిషయమును వినియే యున్నానని యొప్పు కొనఁదీరవలయును; ధామాత్రేయునితో నీవిషయమునఁ గొంత ముచ్చటింపఁదలంచియే యుంటిని; కాని, నాసొంత కార్యములతొందరలలోఁ దీరుబడిలేక, నామనస్సు దీనిని మఱచినది. — కాని, ధామాత్రేయా! నాతోడ రమ్ము. అజజా! నావెంబడి నీవును రావలయును. మీ రుభయు లును నాతో వచ్చి నామాటల రహస్యముగా గమనింప వలయును. (హీమయితో) సుందరీ! హ్రీమయీ! మీ తండ్రిగారితలంపునే నీతెంపుతమి ననుసరింపఁజేయఁబ్రయ త్నింపవలయును. — అట్లు కానిచో, ఈరాజ్యపుఁజట్టములం బట్టి, యివి యనుల్లంఘ్యములుకదా!, యావజ్జీవమును సన్న్యాసినివగుటకో, లేక, మృతినందుటకో, సంసిద్ధురా లవై యుండకతప్పదుసుమీ! (శివపాలితతో) ప్రియు తమా! ఇఁకఁ బోదమా? ధామాత్రేయా! అజజా! మీరును రండు. మీ కుభయులకు మావివాహోత్సవసం దర్భములందును గొంతపని చెప్పవలసియున్నది; మీరు తెచ్చిన వివాదవిషయమునఁగూడ రహస్యముగ మీతో సంప్రతింపవలసియున్నది.

అజజుఁడును, ధామాత్రేయుఁడును:— చిత్తము! మీయాజ్ఞకు బద్ధుల మగుటయేకాక, మాకోరికయు రావలయుననియే.

(హ్రీమయియు లనచంద్రుఁడును దప్ప మిగిలినవా రందఱు నిష్క్రమింతురు.)

లవచంద్రుఁడు:— ఏమి ! యీవింతమార్పు ! ప్రేయసీ! నీచెక్కిళ్లింతగ నింతలోనె పాలిపోయినవేల ? వింతరంగు లీను రోజాకుసుమము లచ్చోటవిచ్చక వాడుచున్న వేల ?

హ్రీమయి:— బహుశః వర్షములేమిచేఁగాఁబోలు ! నానేత్ర వారివాహములు స్తంభించి యావర్షాసారమును బిగఁబట్టిన వని యూహించెద.

లవచం:— నావిచిత్రకర్మపరిపాక మేమోకాని, నే నేయేయితిహాసమును, పురాణమును, చరిత్రనుగాని యెత్తిచదివినను, లేక, ఏయేకథల విన్నను, ఐచ్ఛికగాంధర్వవివాహము లెప్పుడును నిర్విఘ్నముగ సాగుట మిక్కిలితక్కువగఁ గాన్పించుచున్నది. నాయికానాయకులజాతిభేద మైన విఘ్నకారణ మగుచున్నది. అథవా;

హ్రీమయి:— శివ ! శివా ! అతిశయ మగువర్ణతారతమ్యము హేయతమమే.

లవచం :— ఉభయవయస్తారతమ్యమైన విఘ్నకారి యగు; అథవా;

హ్రీమయి:— జవ్వని యొకవయోవృద్ధుని మోహించుటయు నట్లే.

లవచం.— మిత్రవర్గముయొక్క యనుమతి నాశ్రయించి వారి పాణిగ్రహణము సాగుటయైన నొకవిఘ్న మగుచుండును.

హ్రీమయి:— ఇతరుల దీర్ఘదృష్ట్యుద్దేశవైఖరులంబట్టి వీరి మోహాఘ్నరము కట్టఁబడుట మహానరకమే !

లవచం:- అథవా, వీరి మోహాప్రవాహ మనుకూలధోరణి సాఁగియు, రణమారణమో, మరణమో, దుర్భరతరరోగమో, దానిని క్షణభంగురముగ నొనర్చి, గరుడవేగచ్ఛాయవలె, స్వప్నవేగప్రమాయవలె, మంచి చీఁకటినాఁటి మించుతీగవలె, స్వర్గమర్త్యలోకములందలి యానంద రససారము నొక్కనిముసమునసే తసకుబుసమున దాచినట్లు చేయు నాయమునిమాయ నెంత వ్యత్యస్తమనవచ్చు! తేజః పరిపూరితమగు శృంగార రసక్షీరము శోకపూరవీచీ కల్లోలముల నింతలో నంతరించుట యొంతటి కించను గల్గించుచుండు !

హ్రీమయి:- మోహపూరమున కెవ్వాడు నిట్టి విఘ్నవారమే యుండునెడ, అది కర్మసిద్ధాంతమందలి యొక శాసన రాద్ధాంతమే కాఁదగు. కావున, రానున్న దైవపరీక్షలకు నోర్పుతోఁదాళి నిల్వఁబడియుంట మనము నేర్చుకొనవలయును. మన్మథుని స్కంధావారమందలి భావవిభావాది తరంగములును, చిట్టలకలలు నిట్టూర్పులును, సుఖదుఃఖ భావనలును, రసవీరపరివార మంతేయు నెట్లనపాయవైఖరివో, అట్లే విఘ్నపరంపరయు.

లవచం:- ఓర్పును వర్ణించిన యీనేర్పునకు మెచ్చితి. నాచిత్తమున కొక్కమొత్తసితోఁవ తోఁచినది. హ్రీమయి ! వినుము. విధవయగు నొక మేనత్త నాకున్నది; మహాధన సంపన్నురాలు; సంతానహీనయు; ఆమెనివాస మిచ్చటకు మూఁడుయోజనముల దూరమునసుండును; ఆమె నన్నుఁ

దనదత్తపుత్త్రినిగ భావించి, ఏకవృత్తివిషయకప్రేమతో నాదరించుచుండును. అది యీరాజ్యపుఁ గ్రూరశాసనపు బాధకు నసాధ్యమగు దూరమున నున్నది. కావున, మన మచ్చట గాంధర్వవివాహమాడుటలోఁ జిక్కుండదు. నీకు నామీఁదనే మోహమున్నయెడ రేపురాత్రి మీపితృగేహమునుండి పారిపోయిరమ్ము. ఈనగరమున కర్ధయోజన దూరమున నున్నగహనమునకు, మనము పూర్వ మొక మాయావసంతోత్సవసందర్భమున శీలినితోఁగూడి విహరించినచోటునకు రమ్ము; నిజమ్ముగ నీకై యచట వేచి యుందును; నమ్ముము.

హ్రీమయి:- ప్రియతరుఁడవగు లవచంద్రా! ధన్యనైతిని; సుమసాయకుని కుసుమశరధితోడు! హాటకశిఖరిత మగు పంచశరునియరవిందశరముతోడు! ఆతనితల్లి యగు భార్గవలక్ష్మీదేవియొక్క పెంపుడు పావురముల యమాయికత్వముతోడు! రెంటి నొకటిగఁజేయు నాకాముని సాయకముల రససారముతోడు! కాన్తాజిపురీశ్వరిని వశపఱచుకొన్న యాతురీయయుద్ధవీరుని కామశక్తితోడు! మనుజులు లోకమున నింతవఱకుఁజెప్పి తప్పినట్టియుం దప్పనట్టియు నొట్టులెన్నికలవో యన్నిటితోడు! ఇందువదనల వదనసదనమునుండి కదలి వెడలివచ్చిన యన్నిటితోడు! సుమీ! నీ విప్పుడు చెప్పి వర్ణించినచోటనే తప్పక నీకొఱకు వేచి యుందును; నిజము.

లవచం:- నాప్రేమావతారమా! వాగ్దానమును దప్పకు. అదిగో! చూడుము; శీలిని యిటు వచ్చుచున్నది.

[శీలిని ప్రవేశించును.]

హీ్రమయి:- సుందరాంగీ! శీలినీ! నీకు శివుఁడు వెంటనే కోరికల నొసంగుఁగాక! ఎటు పోవుచున్నావు?

శీలిని:- నన్ను సుందరాంగీ యనుచున్నావా? అతప్పును వెంటనే దిద్దికొనుము- ధామాత్రేయునకు నీవు సుందరాంగివిగనే యుందువు. సౌందర్యదేవీ! నీవు వరదాయినివే! నీనేత్రము నావికుల నాకర్షించునుత్తరపుంజుక్క! నీసువాసితరసనావిలసనమోగోధూమకేదారంబులు హరితవర్ణభరితంబులై కలఁవలకలికలు కులుకుచుండు నిండు వసంతమునందలిపికాలాపములకు రాగాలాపసాధకము లగుచుండును. కొన్నియంటురోగములవలె ననురాగజనకములగుసౌందర్యవాగ్విలసనాదులును సాన్నిధ్యవ్యాప్తి కలవైనచో, నే నెంతధన్యకన్య నగుచుంటిని! నీసాన్నిధ్యమెంతమాన్యతమ మగుచుండె నాకు! నీవాణీగానరసమును నాశ్రవణపుటములు గ్రోలి నావాక్కు శక్తిని వహించుచుండెఁగదా! నీనయనముం గాంచి నాయంబకము సార్థక మగుచుండెఁగదా! ఈజగత్తు నాదైనచో, నేను నీవగుటకుం బ్రతిపణముగా, నొక్కధామాత్రేయునిమాత్రము వదిలి మిగిలినసమస్తజగత్తును నీకిత్తును గదా! దయచేసి, ధామాత్రేయుని నీవేమహిమచే నాకర్షించితివో, ఆనీయంగశృంగారశక్తి నుపదేశింపరాదా?

హీ్రమయి:- ఆతనిపై నెంతకోపించుకొన్నను, ఆతఁడు నన్నింతగ వలచుట యొకవింతయే.

శీలిని:- నీయాగ్రహాతీక్ష్ణవీక్షణముల కున్న దివ్యశక్తి నా స్మేరాననకటాక్షముల కున్న నే నెంతధన్య నగుదును! హా!

హ్రీమయి:- నే నిమ్ముశాపములకు బదులుగ నాతని మోహాలాపములను వింతగఁ జింతావహములే!

శీలిని:- ఓ! నాప్రార్థనమంత్రములకు నీశాబరమహిమయున్న నాశాభరిత నగుదుఁగదా!

హ్రీమయి:- నే నతని సేవగించినకొలఁది, ఆతఁ డంతయెక్కువగ వెంట నంటుచుండును!

శీలిని:- నే మోహించినకొలఁది, ఆతఁడు న న్నేవగించుచున్నాఁడు.

హ్రీమయి:- కనుక, శీలినీ! ఆతనిమూర్ఖతకు నావలనియెట్టి తప్పును గారణము కాదు.

శీలిని:- కాదు; నిజమే; కాని, నీసౌందర్యమహిమయే హేతువు. ఆతప్పే నాదైయుండిన నెట్లుండెడిదో!

హ్రీమయి:- నన్ను నమ్ముము! ఆతనిని నా మోహముఁ జూడ నీయను. శాంతివహింపు మిఁక! లవచంద్రుఁడును నేనును గలిసి యింటుండి పాఱిపో నెంచితిమి. ఈలవచంద్రదర్శనము నాకుఁ గాకపూర్వము నాకీయర్ధనిశానగరము స్వర్గతుల్యమై యుండె; కనుక, ఈలవచంద్రికళామహిమ పూర్వస్వర్గమగునీనగరదుర్గము నొకరౌరవనరకముగ మార్చివైచినది.

లవచం:- శీలినీ! నీకుమాత్రమే మారహాస్యోద్దేశమును జెప్పుచున్నాము, సుమీ! రేపురాత్రి చంద్రికళ కొలంకు

టద్దముం జూచి తనపాపట దిద్దికొనుచుఁ దనసుధాబిందు సందోహముచే దూర్వాంకూరాంచలముల మౌక్తికప్రంగుచ్ఛులం గ్రుచ్చుముహూర్తమున మేము మానసనగరకవాటముల దాఁటిపోఁగలిగితిమి. అట్టిసమయమే గాంధర్వ వివాహములనియమచర్యల కనుకూలసమస్య సలుపును.

హ్రీమయి:- మన ముభయులముం గూడి యిష్టగోష్ఠిఁ బాటల పటలశయ్యపైఁ బరుండి యెట మనయంతరంగంపుభంగంపు సొంపుతెంపులం జెప్పుకొనుచుంటిమో యాపనాంతమునం జేరుకొందుము; అంతట నీవ త్తనప్రాంతముం దాఁటి నూతన మిత్రిబృందముపై మాదృష్టిం బ్రసరింపఁజేయవలసి వచ్చును; అభినవప్రకృత్యాకృతులం గాంచవలసివచ్చును. భవిష్యత్పరిస్థితు లెట్లుండునో! ప్రియసఖి! సెల వొసంగెదవా? మమ్ము నాశీర్వదింపుము. నీకోరిక సఫలమై ధామాత్రేయుఁడు నీకు వశుఁడగుంగాక!

(లవచంద్రునితో)

లవచంద్రా! వాగ్దానముం దప్పకుము. రేపటియపర రాత్రివఱకు మనప్రేమాంకూరపూరిత కటాక్షకుక్షుల కుపవాసమేసుమీ!

లవచం:- హ్రీమయీ! తప్పక రాఁగలను; నమ్ముము.

[హ్రీమయి నిష్క్రమించును.]

శీలినీ! శంభు శ్శుభంకరోఽస్తు. నీ కాతనియందున్నట్లే, ధామాత్రేయునకును నీమీఁద మోహ ముండుఁగాక!

(లవచంద్రుఁడు నిష్క్రమించును)

శీలిని:- (తనలో)లోకమందుఁ గొందఱియదృష్ట మెంత శ్లాఘ్య
తరముగ నుండును ! మాయూర్ధ్వనిశాపురిలో ప్రేమమయియు
నేనును సౌందర్యమున సమానులమనియే యందురు; అయి
నను, దానివలన ఫలమేమి ? ధామాత్రేయున కట్లు
తోఁపదు. ఇతరు లెట్లు తలంచిన నేమి ? ప్రేమమయి
మీఁదనే పొరపాటుచేత నాతని కెట్టి మోహాతిశయము
కలదో, అట్లే, ఆతనిగుణగణములం బట్టి నేనును బొర
పడుచున్నాను గాఁబోలు. మోహ మెట్టినీచగుణములు
గలవానినైన మహోత్తమోదారగుణములు గలవానినిగా
మార్చివేయఁగలదు. మోహమునకుం జర్మచక్షుర్దృష్టి
శూన్యము, అంతరంగదృష్టియే ; అందుచేత నేఁబోలు
ఱెక్కలు గలకామదేవునిం జిత్రకారులు గ్రుడ్డివానిఁగాఁ
జిత్రింతురు. కనుకనే కామునియిచ్ఛాశక్తికి జ్ఞానశక్తి తోడ్ప
డదు; ఱెక్కలవేగముతో మోహితులచంచలమనస్సు గ్రుడ్డి
యైఁబోతు చేనిలోఁబడ్డరీతి బుద్ధిలేనిపరుగు లిడుచుండును.
కామునిం బసిబిడ్డగాఁ జిత్రించుటకును గారణ మాతని
ధాటికి యుక్తాయుక్తవివేచన ముండదనునీతిని నేర్పుటకే.
వెఱ్ఱికుఱ్ఱ లాటపాటలలో వెక్కసపుటాట్లు పెట్టుకొనరా ?
అట్లే, కామబాలునకును బూర్వగాథలందు నేమ మిసుమం
తయు లేదు ప్రమాణగతిని. ధామాత్రేయుఁడు ప్రేమమయిం
జూడనంతవఱకు నతఁడు నాచేతికీలుబొమ్మవలెనే ప్రమాణ
కరకావర్షములఁ గురిపించుచుండెను ; ప్రేమమయి వేడి సోకిన
తోడనే యాకరకలు కరఁగి, ప్రమాణము లన్నియు నవ
మానకరములు కాసాఁగెను, ఇపు డుపాయ మొకటి చిక్కె

నది ; వెంటనే యాతనికడ కేగి, క్రీంమయి పారిపోయిన గుట్టు రట్టు పఱచుచు ; పసుపుటంగీకనే రేపురాత్రికిం దాను వెంబడించు సమకట్టు. ఈయుపకారమునైన చేసిన నన్నుం గొంతయాదరింపక పోవునా ? లేక, ఇదియే నా కప కారముగం బరిణమించునో ? పోనిమ్ము ; ఇట్టిగుట్టును బయటం బెట్టినందునకైనను, ఆతనిపునర్దర్శనము లభించుట యుం గలుగును ; నామదనతాపముం బెంచినను, కొంచెమైన శాంతిం గలిగించునేమో ! [శిలిని నిష్క్రమించును]

## —♦ రెండవ రంగము ♦—

[ అర్థనిశాపురి : కిమ్మయునియిల్లు ]

[ కర్మకారు లంఱఱుం బ్రవేశింతురు. ]

కిమ్మయుఁడు:- మనసంఘమువా రంద ఱిక్కడకు వచ్చి యున్నారా ?

భూతపుబుద్ధి:- మీయొద్ద నున్న చిట్టాప్రకారము పేరుపేరువరు సనఁ బిలుచుట యుక్తము.

కిమ్మ:- ఇదిగో ! చిట్టా. దీనిలో, మనప్రభువుగారి వివాహ మహోత్సవమునాఁడు రాత్రి మన మాడఁదలంచిననాటిక లోనిపాత్రలను స్వీకరించుటకు మననగరమునఁ దగినవారల నామము లన్నియుం గలవు.

భూత:- కిమ్మ్రయా! మొట్టమొదట మననాటకము దేనిని గూర్చియో వివరించి, తర్వాతఁ జిట్టాలోనినామములం జదువుఁడు. అది యొకపద్ధతిగా నుండును.

కిమ్మ్ర:- అయిన వినవయ్యా? మన మాడఁబోవునది యొక ప్రహసనము; విరామ దశాబీబీలచావుం గూర్చిన యొక శోకాంత మగునాటిక.

భూత:- నిజముగా మంచినాటికయేనుండీ; మిగుల హాస్యరస భరితమే. కిమ్మ్రయా! దయచేసి యిఁకఁ జిట్టాప్రకారము నామములం జదువుఁడు. అయ్యలారా! సంసిద్ధులై వినుండు.

కిమ్మ్ర:- నాపిలుపునకు హాజరని ప్రత్యుత్తర మిందు. నేతఁ గాఁడగు భూతబుద్ధి.

భూత:- సంసిద్ధుఁడను. నాపాత్రభాగమును నిర్ణయించి తరు వాత నితరులం బిలువుఁడు.

కిమ్మ్ర:- భూతబుద్ధీ! నీవే విరామపాత్రను స్వీకరింపవలయును.

భూత:- ఈవిరాముఁ డెవఁడు! ఒకశృంగారనాయకుఁడా? లేక ఒకనిరంకుశక్రూరభూపాలుఁడా?

కిమ్మ్ర:- మోహావశుఁడై మహాసాహసముతో నాత్మహత్య కావించుకొనుధీరోద్ధతుఁడు.

భూత:- శోకరసము నాసందర్భములం బ్రదర్శించుటలోఁ గన్నీ టింగూడఁ గార్చవలసివచ్చును. నన్ను నారసపోషణాశక్తిం దిలకించి, ప్రేక్షకులు కన్నీరు మున్నీరుగఁ గార్చి తల్లడిల్లు

దురు, సుండీ. నాపరిదర్శనము సమర్థమైయే యుండును లెండు. కాని, నాకొకనిరంకుశక్రూరరాజుపాత్రము నిచ్చి యున్న నా కుత్సాహాతిశయ ముండెడిది. హరికృష్ణుని పాత్రము నిచ్చిన నెంతోనేర్పు చూపుచుంటిని ; నేనును, ఏపిల్లికూననో, చీల్చివైచి, నావీరరసముం జూపుచుంటిని.

నే నెట్లుచదువుదునో విందురా !

నీరధివీచీవాతప్రాక్ఛిఖరము
వారణధాటీపటుఖరనఖముల్
భోరున సాపాశ్వికశితఖురముల్
చేరి తమఃకటకముఁ జీల్చవొకో ॥

తలుపులఁ జీల్చుచుఁ దరణిరథంబుల్
గలువులఁ దీసెడికన్నులకృత్రిధి
దళుకున వెల్గుచు, జనుల మనమునల్
బలిసిన కలుషత తులఁ జీల్చదొకో ॥

ఏమందురు ? నావఠన మెట్లుశ్లాఘ్యతమమో చూచి తిరిగా. ఈధోరణి యేవీరుఁ డగుహరికృష్ణునిపాత్రకో తగి నది ! శృంగారనాయకునకుం దగ దిది. ఇఁకఁ దక్కిన పాత్రల నామములం జదువుఁడు.

కిమ్మః- తరువాత, భద్రస్రుకారుఁ డగు ప్లుతుఁడు.

ప్లుతుఁడు:- అయ్యా ! హాజరు.

కిమ్మః- ప్లుతా ! నీవు దిశాబిపాత్రను స్వీకరింపవలయును.

ప్లుతుఁడు.- దిశాబీ యెవరు ? దేశదిమ్మరి యోధుఁడా ?

కిమ్మ:- విరాముఁడు వరింపవలసిన వధువుపేరోయి.

ప్లుతుఁడు:- ఆవేసము నాకొద్దండీ! నాకు స్త్రీవేషము వద్దు. నాకు గడ్డము పెరుగుచున్నది.

కిమ్మ:- అయిన నేమి? మొగముకప్పును ధరించి యాడవచ్చును. నీవెంతకొంచెము మాటాడినను జాలును.

భూత:- ముఖమును గప్పుకొనుటకు వీలుండుచో దిశాబీపాత్రను గూడ నేను స్వీకరింపవచ్చును; నేను గడుంగడు సన్నని స్వరముతోఁ బలుకఁగలను; దిశాబీవేస మూని, "ఓవిరామా! నాకామసముద్రుఁడ వగు ప్రాణనాథా! నేను నీప్రాణనాయకిని" అని యందును.

కిమ్మ:- అందునకు వీలులేదు. నీవు విరామవేషమే వేయవలయును; ప్లుతుఁడు దిశాబీవేసమే వేయవలయును.

భూత:- సరే! తరువాతి కలాపము సాఁగింపుఁడు.

కిమ్మ:- దర్జీ [కుట్టుపని] వాఁడగు తారాలింగయ్య

తారాలిం:- ఉన్నానయ్యా.

కిమ్మ:- తారాలింగయ్యా! దిశాబీతల్లి వేసము నీది. తరువాత, మాటుకంచరి యగుచణాటుఁడు వచ్చియున్నాఁడా?

చణా:- వచ్చియున్నాను, కిమ్మయ్యగారూ!

కిమ్మ:- నీవు విరాముని తండ్రివేసము వేయవలయును; నేనే దిశాబీ తండ్రివేసమును వేసెదను. [శిశునాగునితో] శిశు

నాగా ! నీవు సింహవేషము వేయవలయు ? ఇంతటితో నాటికపాత్రలపట్టి పూర్తియగుచున్నది.

శిశు:. సింహ మనవలసిన భాగమును వ్రాసిపెట్టినారా ? దయ చేసి, మీరు దానిని వ్రాసియున్నచో, నాకు వెంటనే యీవలయును ; నాకు జ్ఞాపకశక్తి మిక్కిలి తక్కువ, సుండీ.

కిమ్మ్మ:- నీవు పఠింపవలసినయవసరమే లేదు; నీపని వట్టిగర్జనమే.

భూత:- ఆసింహవేషముం గూడ నాకే దయచేయుఁడు ; ప్రతి ప్రేక్షకుండును సంపూర్ణానంద మొందునట్లు గర్జించెదను. నాగర్జనముం విని ప్రభువుగారు "తిరిగియొకసారి, తిరిగి యొకసారి" కావలెననునట్లు చేసెద.

కిమ్మ్మ:- ఓరి వెట్టివాఁడా ! అంతభయంకరముగా గర్జించినచో రాణిగారు మొదలగుయువతీమణులు బిట్టడలి, యట్టె యఱచి పాఱిపోఁగలరుసుమీ ! అంతట మనప్రభువుగారు మనల నందఱ నురితీయ నాజ్ఞయీయఁగలరుసుమీ ?

అందఱు పనివాండ్రు:- అందుచే మనలోని ప్రతిమనుజుఁడును, తల్లికడుపునఁ బుట్టినవాఁడు, వెంటనే యురితాళ్లఁ గట్టఁబడును ; సుండీ.

భూత:- నేను మీమాటకు నొప్పుకొందును; నిజమే; ఆయువతీమణులు దిగ్భ్రమనొందెదునట్లు చేసితినేని, మన కందఱకు నురితాళ్లఁడే గతిచేయుదురు ; కాని, నాకంఠస్వరము నెట్లు హెచ్చింతు ననుకొంటిరి ? పావురపుంబల్లి కూఁతవలె గర్జింతును; బుల్బుల్పలుకుల ననుకరింతు ననుకొనుఁడు.

కిమ్మ:- నీవు విరామునిపాత్రనే స్వీకరింపవలయును. తప్పదు ; ఏలన, విరాముఁడు మంచి ముఖలావణ్యాదులు కలవాఁడు; పగటిపూట నంతటియందగాఁడు మనకుఁ గాన్పింపఁడు ; మిక్కిలి సుందరుఁ డగుపెద్దమానిసి ; కనుక నీకే యా పాత్రను స్వీకరింపక తప్పదు.

భూత:- కానిమ్ము ; అట్లే స్వీకరించెద ; నే నెట్టిరంగుగల గడ్డమును ధరింపవలయును ?

కిమ్మ:- ఏమిప్రశ్న ! నీయిష్టమువచ్చినది.

భూత:- మనగోధుమగడ్డిరంగుదియో, లేక నారింజపండువన్నె కలదియో, లేక, ఊదాగోధుమవర్ణపుగడ్డమో, ఫ్రెంచి కాసురంగుదియో, లేక మనపసుపుఁబచ్చనిరంగుదియో !

కిమ్మ:- ఫ్రెంచికాసులకు బొచ్చుండదోయీ ! అయిన బోడితలతో నాడెదవా యేమి ? చాలుఁ జాలు.

[అందఱితో]

అయ్యలారా ! మీమీ వేసములభాగము లివి. రేపు రాత్రిలోఁగా వీనిని బాగుగా వల్లింపవలయునని నా కోరిక, నాప్రార్థన. మీరందఱు నగరమునకుం బరుగుదూరమున నున్నవనములో వెన్నెలవేళ నన్నుఁ గలిసికొనవలయును ; ఆస్థలమే మనశుమ్మక్కపూర్వసాధనకుఁదగినచోటు; నగరమున నెక్కడఁగూడినను జనులు గుమికూడి చెడఁ గొట్టుదురు. ఈలోఁగా మనకుఁ గావలసిననాటకసాధన సామగ్రియొక్కచిట్టా సిద్ధపఱతును. తప్పక యచ్చట మీ రుండితీరవలయును.

భూత:- తప్పక మేము వచ్చెదము; అక్కడనే మనము వికృతముగా ధైర్యసాహసములతో సాధనచేయవచ్చును. శ్రమపడి తాము సలక్షణముగా దీనిని నెఱవేర్పవలయును. ఇంతే. మహాదేవ! సెలవా?

కిమ్మీ:- రాచమర్తికడఁ గలియుఁడు.

భూత:- చాలును; ఇన్నిమార్లు హెచ్చరిక చేయనేల? ఎన్ని చిక్కులు వచ్చినను, రాక తప్పము.

[అందఱు నిష్క్రమింతురు.]



# ద్వితీయాంకము



## మొదటిరంగము

[ పురపరిసరవనము ]

(ఘూత్కారుడును మఱియొకభూతమును సంధింతురు.)

ఘూత్కారుడు:- ఏమి ! విశేషాలు ! భూతవరా ! నీ వెక్కడఁ దిరుగఁబోవుచున్నావు ?

భూతము:- గుట్టలమీఁదను గునగున నడతును
మిట్టలు దిగుచును మేఁకలగుంపులు
లోయల మేయ విలోకనచేయుచు
సాయము లేకయ సరసరఁ దిరుగుదు
పొదలను ముండ్లను బొలములకంచెలఁ
గుదురుగఁ బెరిగినకుసుమపుఁదోఁటల,
వఱదలు వచ్చిన, వహ్నులు గ్రమ్మినఁ
దిరుగుట కడ్డపుఁదెరువే లే దిల ;
రేవెలుఁగు దివిఁ రేలఁ జలించెడి
యావేగము నాయీవడి కాగదు.
సేవలఁ జేయుదుఁ జెంతనె భైరవు
దేవికిఁ బచ్చగఁ దివిరెడిపచ్చిక
వంపులఁ గొనలను వలిపెపుఘంచున
సొంపుగ ముత్తెపు శోభలఁ గూర్చుదు

రాణిగభీరపురాట్పరివారము
క్షోణిపయిం దగుసుమనసముదయ మగుచు.
పచ్చనిపూవులప్రక్కలం గన నగు
నచ్చపుబొట్టనిమచ తె కెంపులు
మామహిమాయ యామత్వులం గూర్చుచు
గాముకజనముల కాంతులం దీర్చంగ.

క. పోవలయును బనితొందఱ
చే; వలిమలమంచుం దెచ్చి చిలుగరికెకొనల్
కోవలుగ ముత్తెపుంగమి
తో వన్నెలు మించునట్లు తొడుగంగవలయున్.

క. సెలవా ? వికారభూతమ !
నిలుచుట కిది కాదు సమయనిర్ణయదీక్షన్
గులుకుచు భూతాళియు మన
కలిమికి గతియైనరాణి కదిలి రిచే రాన్.

పుష్ప:- రాజుగారిచ్చోటనే పరివారముతోం గూడి విహరింపం గలరు; కావున, మీరాణిగారిటువైపు రాకుండునట్లు మీరు జాగ్రత్తపడవలయును; రాజుగారు మిక్కిలి ముకోపియై యున్నారు. ఒక భారతవర్షీయరాజకుమారునిం దనపరివారములో రాణిగారు చేర్చికొనంగా నారాజకుమారునే తనయంగరక్షకసైన్యములో మా భైరవరాజుగారు కొలువుంచుకొనంగోరిరి ? దీనిమీంద వైరము ముదిరి పోయెను. రాణి యీరాకొమరునిం దనసన్నిధిలోనే వాని తలపైనం బూలు ముడుచుచు ముద్దులాడుచుం బెంచుచు

రాజుగారికడకుఁ బంపదు. ఇందుచేత మనరాజగుభైర వుఁడుగారును రాణిగా రగుత్రిధన్యగారును బొత్తుగా నను కూలదాంపత్యచిహ్నములం జూపక, ఉద్యానాదులంగాని, హ్రిదసమీపములంగాని, వెన్నెలరాత్రులంగాని కలియు టయే మానుకొనిరి. వారి పాత్రికూల్యము మిక్కిలి బెడిసి యుంటచే వారికోపాటోపమునకు వెఱచి యోగినీగణ ములు లక్షిమాదిశక్తులచేత నందందు దాఁగుకొనుచున్నవి.

భూత:- నేను బొరపడితినా! లేక, నిజముగా నీవు ప్రఖ్యా తితోఁ గొంటెపనులం జేయుపుష్కరుఁడవా? దొంగవేస ములతోఁ గామరూపివై పల్లియలందలి కన్నియల భయ పెట్టుకొంటెవాఁడవు కావా? అప్పుడప్పుడు మీఁగడల దొంగిలించి గొల్లల బాధించుభూతమవు కావా? కొన్ని యెడలఁ దిరుగండ్లు త్రిప్పి మోసవుఁబని చేయువాఁడవే గదా! మఱియొక్కపుడు గొల్లపడుచు లెంతచిలికినను, వెన్న సున్నచేయుకొంటెవు నీవేకదా! మద్యముమీఁదను దెట్టెయే కట్టకుండఁ జేయుభూతమవు నీవేకదా! రాత్రు లందుఁ బ్రియూణికులఁ బొరపెట్టి, తప్పాదారుల కీడ్చి తుదకుఁ బరిహాసించుకొంటెవు నీవేకదా! నిన్నుఁ బుష్క రుఁ డనునామముతో సంబోధించువారిని మాత్రము గౌరవించుట నీగుణమేకదా! ఈవర్ణనము నీదియేకదా!

పుష్క:- నిజమును నీవు కనుగొంటివి; నీవు వర్ణించిన రాత్రిం చరుఁడను నేనే. మనభైరవప్రభువునుగూడ నాహాస్యచర్య లచే నవ్వించుచుందును. చిక్కుడుగుగ్గిళ్ళు తిని బలిసిన

బూటకపుఘోటకపు వేసమువేసి, తట్టుపిల్లవలె సకిలించి నవ్వింతును. మద్యపాత్రి నెత్తి త్రాగఁబోవుతఱిఁ గాల్చిన మెండ్రివలె నున్నట్లుండి మిడిసిపడిపోవుచు స్త్రీలతొడల మీఁద మద్యమంతయుం జిందునట్లు చేయుదును. అనుభవ విశేషముతోఁ గథను మిక్కిలిజాలిగలుగఁ జెప్పుచుండు తఱిఁ బ్రక్కనే పీఠికవలెఁ గూర్చుండి, యాముసలియమ్మ నామీఁద నోరఁగ ; వెంటనే జాఱి, యామెను బడవైతును ; అంతట నయ్యో యని రోదనముచేయుచు బిగ్గరగ దగ్గసాఁగును ; వెంటనే కథను వినుచున్న బాలబాలికలు కడుపుబ్బ నవ్వసాఁగుదురు. కొందఱు నవ్వినవ్వి, దగ్గుదురు, కొందఱు తుమ్ముదురు, మఱికొందఱు ముసలిది విచిత్రముగాఁ బడినదనుచు హాస్యసముద్రమునఁ దేలుచుందురు. సరే! కాని, ఇదిగో ; చూడు ! మనభైరవరాజుగారు వచ్చుచున్నారుసుమీ ! తొలఁగి నిలువుము.

భూత:- మారాణిగారుకూడ నిటే వచ్చుచున్నారే. ఇఁక నేమి చేయుదము ? రాజుగారు మఱియొకదారినఁ బోయిన నెంతమెఱుఁగుగ నుండెడిది.

(ఒకవైపునుండి సపరివారముగ భైరవరాజుగారును, ఎదురుగా సపరివారమై త్రిధన్యారాణియుం బ్రవేశింతురు.)

భైరవుఁడు:_ అహంకారవతీ ! ఈపండువెన్నెలలో నిటేల వచ్చితివి ?

త్రిధన్య:- ఓర్వలేనివాఁడా ! ఏమంటివి ? [స్త్రీపరివారముతో తొలఁగి సాఁగుఁడు. నా కాయనతోడి సంబంధము తెగినట్లు

భై:- ఏమే? గర్విణీశిరోమణీ! నీభర్త నగునన్నే యిట్లు తృణీకరింతువుగా!

తి:- నీవు భర్తవైనచో, నేను భార్యను గావలసివచ్చును. కాని, నీవు మన భూతప్రపంచమును వదలి నీకోరినకామరూపములం బూని దంటుపిల్లనగోవ్రులతో శృంగారరస భరితము లగుపాటలం బాడుచు భిల్లవనితను మోహావరవశను జేసి వచ్చినగుట్టు నట్టె మఱచితి ననుకొంటివేమో! ఆహిమవన్నగశిఖరములనుండి తిరిగి యిచ్చటకు నేలవచ్చినాఁడవు? నేఁడో, రేపో, నీవు మోహించియున్న శివపాలితను దేవేశుఁడు వివాహమాడనున్నాఁడని విని, నూతనవధూవరుల నాశీర్వదించిపోఁదలంచి వచ్చియున్నాఁడవు కాఁబోలు!

భై:- నీవు సిగ్గును వదిలి నేను శివపాలితను మోహించితిననుట నీవు దేవేశుని మోహించియుంటి వను నిజ మెఱిఁగిననాకు నొకవింతగ లేదు. నీవు నీచెలికత్తెలతోఁ గూడి యేయే సందర్భముల నెట్టెట్లు దేవేశుని మోసపెట్టితివో నే మఱచితి ననుకొంటివా?

తి:- రంకునకుం బ్రతిగా రంకును నిశ్శంకముగాఁ గట్టఁగలవులే! గడచినవసంతము మొదలుకొని నాయోగినీపరివారముతో నే నేనిర్ఝరతీరములందును, సరోవరతీరములందును, పారావార ప్రాంతములందును, నాట్యమాడుచున్నను, వచ్చి యల్లరిచేసి మాకొల్లాటములకు విఘ్నముం గలిగిం

చుచుంటివి. భూతపతి వయ్యు, వాతపోతములను నీవశమం దుంచుకొనకుండుటచే మహావాతము గా సకలతోయధుల నుండి నీరమంతయుం గొల్లి విచ్చలవిడిగ నతివర్షములం గురియుచుంటచే సకలఖండములందలి నదీనదంబులు నుప్పొంగి పంటల నన్నింటిం బాడుచేసినవి ; కర్షకుల చెమ్మటలఫలము వమ్మైనది ; పచ్చపచ్చనినీవారాదులు కేదారంబులనే కుళ్లిపోయి నశించినవి ; రోగాతిశయ ములచేత నజావ్యాదిపశుగణంబులు మరణించినవి ; కాక ఘూకాదికములకుం బశుమాంస మపరిమితమై యవి బలిసి మెలఁగుచున్నవి ; పిల్లలాడుకొనుమైదానములందు గీతల గురుతుపట్టలేక యల్లాడుచున్నారు ; జనులకుం గదల వీలులేకుండ నతివర్షబాధ హెచ్చినది ; వర్షము లాగి చలకాల మెపుడు వచ్చునాయని జనులు తహతహ పడుచున్నారు ; సాధారణముగా రాత్రులందు విననగు గానమాధురి సర్వశూన్యమైనది. వెల్లువలకుం గారకుఁ డగుచలివెలుంగులదొర ఖరకిరణుండు గానరామిచే విట్టివిగి పెక్కురోగములకుం గారకుఁడగుచున్నాఁడు. ఈకాలవైప రీత్యముంబట్టి ఋతువులే మాఱినవి. ఎఱ్ఱనిరోజాపూలు బిఱ్ఱబిగియించుమంచులో వికసించునా ? హేమంతంబునం గంతునిసుమసాయకములం గాంతు మిది వింతకాదా ? వసంతాదిఋతుసంతతి తమతమసొంతగొనముల వదలి, తమతమవఋువల మార్చుకొనిన ట్లున్నయవి. ప్రపంచ మాశ్చర్యసముద్రమున మునిఁగి తేలుచు దారిడొంకలు

తోఁచక పరితపించుచున్నది. ఈయనర్థపరంపరలకు నాది కారణము మనయుభయులకు మధ్యఁగలిగినయశాంతియే. మనమే యీమనుజులయిక్కట్టులకుం గారకులమైతిమి.

భై:- కనుక, నీవే తగినసవరణ చేయవలయును; అది నీచేత నైనపనియే. త్రిధన్వయే యన్యుఁడుగానియీభైరవునితో నేల వాదులాడవలయును? నే నారాకొమరుని నాపరివారమునఁ జేర్చుకొనఁగోరుటయే నాతప్పా?

త్రి:- ఆవిషయమును గదలింపకుము. శాంతితో మెలఁగుము. నీవు నీరాజ్యము నిచ్చినను, నే నారాకొమరుని నీయఁజాలను. ఈతనితల్లి నాభక్తురాలు; నాసన్నిధిలోనే యుండి, యెట్టియిక్కట్టులు కలిగినను, సహించుచు, నచ్చటివణిగ్జనులఖిలఖండములనుండి తెచ్చునచ్చపుసరకుల నపుడపుడె నాపూజలకై సమర్పించుచుండ, మనుజదేహము నశ్వరమగుటచే నీశిశువును గని దివికేగెను. ఆభక్తురాలికై యీరాకొమరుని నేఁ బెంచితీరవలయును; ఆభక్తి నెంచియే యీకొమరుని నే వదలఁజాలను.

భై:- ఈవనమున నెంతకాల ముండఁదలఁచితివి?

త్రి:- బహుశః దేవేశునివివాహరాత్రివఱకు. నీదుండగములు మాని మాయోగినీగణములతోఁ గలసిమెలసి నాట్యాదుల నలుపఁగలవేని, మాతోఁ గలిసిరమ్ము. లేదా, నాతో నీకుఁ బనిలేదు; నీవనములందు నే నడుగుపెట్టను.

భై:- నారాకొమరుని నిచ్చితివేని, నీతోఁ గలసివత్తును.

త్రి:- నీరాజ్య మంతయు బదులిచ్చితిని, వాని నీయఁజాలను.

[భూతములతో]

భూతములారా! సాగి కదలుఁడు. ఇఁక నిట నిల్చి నచో మాత్రగవు పెరుగును. సాగుఁడు.

[త్రిధన్వ సపరివారముగ నిష్క్రమించును.]

భై రః- మంచిది! పోమ్ము. నీకుఁ దగినశాస్తి చేసెద. ఎట్లు పోయెదవో యీావనమును విడిచి, చూచెదఁగాక! పుష్కరా! నాప్రియసేవకా! ఇటు రమ్ము. పూర్వమొక నాఁడు నే నొకయద్భుతరమందలి ధరాగ్రముమీఁదఁ గూరు చుండియుండ నొక్కయచ్చర యొకమచ్చెముమీఁద నెక్కి యతిమనోహర మైనరాగాలాపమును జేయుచు నంబుధి తరంగముల కే నిశ్చలత్వమును గలిగించుచుండ, కొన్ని నక్షత్రమండలములే గానరసమునకుఁ గఱఁగి దిగివచ్చుచున్నవో యనున ట్లుల్కాపతనము కానవచ్చెను. నీకు జ్ఞప్తియున్నదా?

పుష్కరుఁడు:- జ్ఞప్తికి వచ్చినది. ఆసమయమునందే చలి వెలుంగులమండలమునకును మనభూమండలంబునకును మధ్యగా మన్మథుఁడు కుసుమసాయకహస్తుఁడై యాకసమున నెగురుచుండ నేఁజూచితిని; నీవు చూడఁజాలకుంటివి. ఆతనికుసుమబాణము నొకపాశ్చాత్యదేశపురాణిమీఁద గురిపెట్టి ప్రయోగించెను; కాని, అది లక్షలహృదయకుత్తుల ఛేదింప సమర్థమయ్యెను, ఆరాణికిం దగులక పెడ

దిరిగి చంద్రమండలాంతర్గతపవిత్రకళానీరధిలోఁ బడి శాంతించెను. ఆచంద్రునిభర్తురాలగురాణియొక్కకన్యాత్వమున కెట్టిహానియుం గలిగింపఁజాలకపోయెను. కాని, ఆబాణ మారాణికిం దగులక దేనిమీఁదఁబడెనో నే గమనించితిని. ఆశర మొకపడమటిచిఱుమొగ్గమీఁదఁ బడి, దానియవదాతవర్ణమును మార్చి గూడుగట్టిననెత్తుటిరంగును గలిగించెను. ఆసుమంబును సుమకోమలులు "మదనునిమత్తం"దురు. నీవాకుసుమంబును గోసి తీసికొనిరావలయును. ఆయోషధిని నీకొక్కతటి నేఁ జూపియున్నాను. ఆకుసుమరససారముం దెచ్చి నిద్దురపోవుచున్న స్త్రీపురుషులనేత్రములమీఁద రంగరించినచో, వారు లేవంగనేజంతువు వారిదృష్టిపథమునం బడునో దానిమీఁద మదనమోహపరవశు లగుదురు. ఈపుష్పమును దిమింగిలము మూఁడుమైళ్లీఁదుకాలములోఁగానే తేవలయును.

పుష్క:- నాకు దూరము లక్ష్యమా ? ఈభూమండలము నడుమున నొడ్డాణ మతికించి రెండుగడియలలోఁ దిరిగి రమ్మన్నను రాఁగలను. (అని నిష్క్రమించును)

షైర:- (తనలో) ఈపుష్పరసము నాకుఁ జిక్కినతోడనే చక్కఁగఁబోయి వెదకి యాతిధన్య నిద్రించుతటి చూచి దాని కనురెప్పలమీఁదఁ బూసివచ్చెదను ; ఈయరణ్యప్రదేశమునఁదిరుగు నేసింగమో, సివంగియో, భల్లూకమో, లులాయమో, తోడేలో, మర్కటమో, కపిరాజమో, కాన్పించితీరును ; వెంటనే యెదయైనగేదె

వలె, దానివెంబడి నిది మోహపరవశయై పరుగిడును. ఈలోఁగానే నారాకొమరుని వశపఱచుకొనివచ్చెద. మఱియొకమూలికారసము దీనికి విరుగు డగుదానిని నే నెఱుంగుదుంగాన, ఈయాట యాడించి మీఁద మత్తును డించివైచెద. కాని, చప్పు డగుచున్నది; ఎవరో వారికిం గాన్పింపక, వారిగుసగుస లాలకించెద.

[ ముందు ధామాత్రేయుఁడును వెనువెంట శీలినియుఁ బ్రవేశింతురు. ]

ధామాత్రేయుఁడు:- నే ని న్నొల్లను; కాన, నన్ను వెంబడింపకు. నీవు హీ్రమయియాలవచంద్రులు పరుగిడి యివ్వనికి వచ్చిరంటివే ? వా రెక్కడ నున్నారు ? హీ్రమయి నావేదనకుం గారకురా లగుచున్నది; నే నాలవచంద్రునిఁ జంపెద. నాహీ్రమయి యీయడవిం గానరాకుండుటచేత నే నొకవెఱ్ఱివానివలె నివ్వనంబునం దిరుగుచున్నాఁడను. కాఁబట్టి, నీవు వెడలిపొమ్ము; ఇఁక నావెంట రాకు.

శీలిని:- వజ్రకఠోరహృదయా ! నీవే నన్నాకర్షించువాఁడవు; సూదియంటురాయివలె నీ వినుపతున్కను జెడగుంజఁ గలవు; కాని, ఉక్కువంటి నాబోఁటిపతివ్రతమతినిమాత్రము మార్పఁజాలవు. నీయాకర్షణశక్తిని వదలినచో, నాకు నిన్ను వెంబడించుశక్తియే యుండదు

ధామాత్రే:- నేనేమి ? నిన్నాకర్షించుట యేమి ? నీతో నిష్ఠురోక్తులనే పలుకుచున్నాఁడనే. నీకు విస్పష్టతమముగా

నీమీఁద నాకు వలపు లేదని, బొత్తుగా నావంతయు లేదని చెప్పుచుండలేదా ?

శీలిని:- అట్లు చెప్పుటచేతనే కాఁబోలు, నావలపునకు మెల కువ యెక్కువగుచున్నది. నీపెంపుడుకుక్కవలె నెక్కడ కైనను వెంబడించుచున్నదానను; కొట్టినను, నీవెంట వత్తు. నీపెంపుడుకుక్కనువలె నన్నుఁ దిరస్కరించినను సరె, కొట్టినను సరే, తృణీకరించినను సరే, తుదకుఁ జంపివేయఁ గోట్టుకొన్నను సరే ; నేను నీకుఁ దగినదానను గాకు న్నను, నన్ను నీవెంబడిమాత్రము రానిమ్ము. ఇంతమాత్రి మైన జాలి నీకుఁ గలుగుట తగదా ? అంతియే చాలు ననుచున్నానుగదా ! అదియే గౌరవాతిశయముగ భావిం తునుగదా ! నీపెంపుడుకుక్క ననుకొనుమంటినిగదా !

ధామా:- నీమీఁద నాపేక్షణ మేక్షణము పడునో యాక్ష ణమే నా కొకభాకుకోగ ముప్పతిల్లుచున్నది ; కావున, నాస్వభావతత్త్వమునకు ద్వేషోద్రేకమును గలిగింపకు.

శీ:- నీవు గాన్పింపనిలిప్త గుప్తతాపమును గలిగించుచున్నది.

ధా:- సిగ్గుబిడియములను బొత్తుగా నిట్లు వదలి నీమీఁద వల పులేనియువకుని వెంబడించుట యెంతవింతతప్పో యోజిం చుము ; అదియుంగాక రాత్రివేళ ; మనుజసంచారము లేని యడవింబడి యిట్లు వచ్చి నీపరిశుద్ధకన్యాత్వము నన్య వశముచేయుటకూడ.

శీ:- నీయస్ఖలితయోగ్యతయే నాయీసాహసమునకుం గార ణము ; నీమోము కన్పడుచున్నసమయము నాకు రాత్రి

కాఁజాలదు; కనుక, నాకి త్తఱి రాతిరి కాదు. నీవే నాప్రపంచమందలి సర్వస్వము కావున, ఇవ్వని ప్రపంచశూన్యమును గాదు ; సమస్తప్రపంచభావరూపుఁడ వగు నీరూపము నన్నుఁ జూచుచున్నతఱి నే నొంటరిదాన నెట్లగుదును ?

ధా:-ని న్నొంటరిగ నిటు వదలి యేపొదరిండ్లలోనో దాఁగి నిన్నీ యటవిమృగములవశము చేయుదును, సుమీ !

శి:-ఎంతవిపినపుఁగ్రూరతమ మగు మృగమును నీహృదయమునకంటె మృదుతరమే యగును. పారిపొమ్ము నీయిచ్చవచ్చినపుడు; పురాణగాథ తిరిగి యొకనాటికయై సాఁగునను కొనుము. అర్యముఁడు పరుగెత్తినను, ఉషఃకాంత వెంబడింపదా ? ఇట్టికథ లెన్నియో విందుము. నీవేగము వ్యర్థమే యగును; పౌరుషవంతుఁడు పరుగిడుట, పిరికి యబల వెంబడించుటయు నెటువ్యర్థములో చూచెదవుగాక !

ధా:- నీప్రశ్నల నాపఁదలంపను; నన్నుఁ బోనిమ్ము; వినక నన్ను వెంబడించితివా, నమ్ము మీయడవిలో నీ కేదో హాని గలిగించి తీరుదును.

శి:- అవును. దేవాలయమునను, బత్తనంబునను దుద కిట్టి యడవిలోను, నీవు నాకు హానినే చేయుదు నంచున్నావు. ధామాత్రేయా ! వ్యర్థుఁడవు, సుమీ ! నీబోఁటివారి దోషప్రకృతులు మాస్త్రీజాతియోగ్యతలకు సానరాళ్లవంటివె యప్పుడప్పుడు నిందయుం గలిగించును. ఏలయన:

మేము పురుషులవలెఁ బోరి మాకోరికల సాధించుకొన లేముగదా ! మేము వరింపఁబడుదుమేకాని, మాకోరిన వరుల వరింపఁజాలముకదా !

[ధామాత్రేయుఁడు నిష్క్రమించును.]

నిన్ను వెంబడించితీరుదు; నే వరించినవాని చేతిలోనే ప్రాణము ల్విడిచి యీనరకమునే స్వర్గఫలకమును నా పాతివ్రత్యమహిమచేఁ జేసెద.

(శీలిని నిష్క్రమించును)

భైర:- ఈసంవాదమును బూర్ణముగ విన్నాఁడను. వనితా మణీ ! ఆతఁ డీవనమును దాఁటులోపలనే నీపైని మోహము నతిశయింపఁజేసి యాతఁడే నిన్ను వెంబడించున ట్లు చేసెద.

(పుష్కరుఁడు ప్రవేశించును. పుష్కరునితో)

స్వాగతము, తిరుగుఁబోతుభూతమా ! నీ కక్కడ నాకుసుమము దొరకినదా ?

పుష్క:- ఆహా ! ఇదిగో

భైర:- ఘనుఁడవోయి ! దయచేసి దాని నిట్లిమ్ము, త్రిధన్య సాధారణముగ నెచ్చట నిద్రించుచుండునో నే నెఱుంగుదు నచ్చోటు ; ఎచ్చట విచ్చలవిడిగ దవనము పెరుగునో, ఎచ్చోటఁ బాటలములయాటోపము మెండో, అటవిసోమలతలు మీఁదఁబ్రాఁకి విలసిల్లునో, కుంకుమ పుష్ప లేవ్వలంకులఁ బెరుగునో, అచ్చోటనే యాత్రి

ధన్య నాట్యములచే నలసి సొలసి నిదించుచుండును. సర్పంబులు తమకూర్పాసముల వదలి మనభూతములకు నున్నని పక్కల నచ్చటఁ గల్పించుచుండును. అచ్చటకుం జేరి యీసుమరసము నాత్రిధన్యనేత్రముల మీఁద వైచి, దానిచేత నొకహేయతమ మగుప్రహసనము నాడించెద. ఈరసములోనికొంతభాగమును నీవు తీసికొనిపొమ్ము. ఈవనములో నొకయర్థనిశానగరపౌరుఁడొకపతివ్రతను దృణీకరించి విసికించి, నిదించియున్నాఁడు; వానికన్నులమీఁదఁ బూసిరమ్ము; పొమ్ము; లేచినపు డాకన్యనే చూచునట్లు గమనించి పూయుము. ఆతనివస్త్రములంబట్టి నీవు గుర్తింపఁగలవు; జాగ్రత్తతో నెట్టిపొరపాటును రాకుండునట్లు పని సానుకూలముఁజేయవలయును. కోడి మొదటికూఁతఁ గూయకముందె నన్నుఁ గలసిపోవలయును.

ప్ర:- భయపడఁ బనిలేదు, ప్రభువరా! మీసేవకుఁడ నగునే నీమాత్రపుఁబనిఁ జేయఁజాలనా?

—* రెండవ రంగము *—

[ఆవనములోనే మఱియొకమూల]

[త్రిధన్య తనపరివారముతోఁ బ్రవేశించును.]

త్రి:- రారె మీరు నాట్యమాడ రాగరసముఁ జిల్కుచుక్ బాఱిపోవవచ్చు నిచటఁ బాడి లిప్తమాత్రమే.

క. కొందఱు రోజామొగ్గల
సందులలో నుండుక్రిములసంతతిఁ జంపన్
గొందఱు గబ్బిలములపై
దందడిఁ బోరాడి పక్షదారణచేయన్.

క. గబ్బిలములఱెక్కలతో
లబ్బిన దాన న్మదూత్తమార్భకములకున్
గొబ్బునఁ గవచపుఁదతిగా,
బిబ్బీలకు నంగరక్ష బెడఁగగునుసుఁడీ.

మఱికొందఱు పోయి మనభూతవితతికి నిద్రాభంగముఁగలిగించునేడుపుఁ గొట్టుటులూకములను బాఱఁదోలవచ్చును. నన్ను ముందు నిద్రఁబుచ్చి మీమీపనులఁ దరువాత నెఱవేర్పవచ్చును.

పాట.

లాలి ! భూతములరాణీ !
కలవాణు - లార ! శుకవాణులారా !
లాలి ! త్రైధన్యవీణా,
లాపముల్ - పాడుఁడీ శాంతి నొందన్.

మొదటిభూతము:- లాలి ! నాలుకలు చీలన్
గాలులన్ - గడుపునిండఁగఁ గ్రోలన్
మే లెఱుంగని నాగులన్
జేలకం - చెలు చేర నెట్టుఁ డీరల్॥ లాలి !
లాలి ! పాడుఁడి బుల్బులుల్ !
లీల మీ - చిత్రింపుఁ జిఱునాలుకల్

ఏలయల్ చెడనీక మేల్
సోలునిద్దుర లిచ్చి హెచ్చు నెపుడున్॥ లాలి ॥

రెండవభూతము:- మార్రాణి కేహానియున్
జేరంగరానీక యేమంత్రిపున్
భారబాధల నెట్టుచున్
నారాయణుండు గాచెడుగావుతన్॥ లాలి ॥
విషపుటేఁగల నెట్టుడీ
మిషకు సాలీళ్ళు పెట్టినపేరులే
భషదుగ్రజంతుతతులన్
వృషవాహుదయ నెట్టి కాపాడుఁడీ॥ లాలి ॥

మొ. భూ:- అందఱు నింకఁబోవచ్చును. రాణిగారికి నిద్దుర పట్టినది ; దూరముగ నొక్కతెమాత్రము కావలి కాచుచు నిల్వఁబడవలెను.

(ఒక తెతప్పఁ దక్కినయందఱు నిష్క్రమింతురు.)

(త్రిధన్వ గాఢనిద్రఁజెందును)

(భైరవుఁడు ప్రవేశించును.)

భైర:-(తెచ్చినసుమరసముఁ ద్రిధన్వ తెప్పలమీఁదఁబిండుచు)
నిద్రలేచి చూచుదాని నే వరించి వెఱ్ఱిగా
నదులం దరణ్యభూమి నటదసహ్యజంతువుల్
క్షుద్రమోహావేగ మూని సొగసుద నెడిమాయచే
విద్రవించి చిత్త మెపుడు వెఱ్ఱి వాదు వింకఁబో॥

క. పిల్లినో చిఱుతనో పందినో
భల్లుకమునో గాంచి యిట్టివనమున వెంటన్
గల్లున మత్తేక్కనగతి
నుల్లము చెడి మోహావశత నుందువుగాతన్॥

[అని నిష్క్రమించును.]

[లవచంద్రుడును హేమ్రమయియుం బ్రవేశింతురు.]

లవ:- ప్రాణనాయకీ! ఈయడవి తిరిగితిరిగి వేసారి మూర్ఛపోవుస్థితిలో నున్నదానవు. నిజస్థితి చూడ, మనము నడువవలసినదారినే మఱచితిని. హేమ్రమయీ! నీకు ననుకూలమైనచో నిచ్చటనే యీరాత్రి విశ్రమించి, ఉదయమునకు వేచియుండి బయలుదేరుదము.

హే:- లవచంద్రా! అట్లే కానిమ్ము. నీ వొకప్రక్కను సాధించుకొనుము; నే నీగట్టుననే తల యానించి పండెద.

లవ:- మన కిద్దఱకు నొకగడ్డితలగడయే యుపయోగపడఁగలదు; హృదయ మొక్కటియేయై, ప్రమాణ మొక్కటియేయై, రెండువక్షఃస్థలము లున్నను, ఒక్కప్రక్కమీఁదఁ గూడియుండవచ్చును.

హే:- అట్లుచేయఁదగదు. నీవు జ్ఞానవంతుఁడవు; మంచివాఁడవు. ఇంకను నీవు కొంతదూరముగనే నిద్రింపవలయును; అంతసమీపమునకు రాఁదగదు.

లవ:- నే నమాయికుఁడ ననియు, నహింసాధర్మనిరతుఁడ ననియు, బ్రహ్మచర్యవిధిజ్ఞుఁడ ననియు ముమ్మాటికి

నమ్ముము. ప్రేమతో నిండియున్నపుడు, అనుమానము నకు సందుండఁదగునా ? నీహృదయమును నాయెద యుం దాదాత్మ్యముం జెందినవి ; కాన నొకటే హృదయ మైనదన్నఁ దప్పేమి ? వధూవరులు చేసికొనవలసినప్ర మాణ మొక్కటేయన్నఁ దప్పేమిలేదుగదా ! ఇఁక నన్ను నీప్రక్కఁ బండుకొన నిచ్చుట కభ్యంతర మేలచెప్పెదవు ; అట్లు పండుకొన్న నో నావలన నన్నృత మెట్లనఁబడును ?

హేమ:- లవచంద్రుఁడు శ్లేషలతోఁ గట్టుకథ లందముగ నల్లఁ గలఁడే ! నానడవడికిని నాపాతివ్రత్యగర్వమునకు లవ చంద్రుఁ డబద్ధమాడెనని నాయభిప్రాయమైనచో, భంగము కొంతగలిగినట్లే యగును ; కాని, మర్యాదలను నీకు నామీఁద నున్నప్రేమను గమనించియైన, యోగ్యుఁడ వగుమిత్రమా ! కొంచెము తొలఁగి పరుం డుట మిక్కిలిమంచిది. ప్రపంచికమర్యాదలంబట్టియు నట్లు దూరమునఁ బరుండుటయే యథావిధిగ వివాహ మాడనివధూవరులకుం దగుయోగ్యకృత్యము ; కావునఁ గొంచెము దూరముగనే పరుండుము. ప్రాణనాథా ! ఈశ్వరుఁడు సుఖశయన మొసఁగుఁగాక ! నీయావజ్జీవ మును నామీఁదిమోహమునకు భంగ మేమాత్రమును గలుగకుండుఁగాక !

లవ:- నీవన్నమాటకుం దథాస్తని ముమ్మాటికి ననువదింతును. ఊపిరియున్నంతవఱకు 'నాతిచరామి' యనుమాట జవ

దాటను. నాప్రక్క యిదియే. నిద్రాదేవి నీవు పూర్ణ
విశ్రాంతిం బొందునట్లుచేయుఁగాక !

హి:- ఈశ్వరుఁ డాశాంతనిద్రనే నాయర్ధదేహ మగునీకును
నొసంగుఁగాక !

[పుష్కరుఁడు ప్రవేశించును.]

పుష్క:- ఎంతో తిరిగితి సెచ్చిట్టడవిన్
విం తేమన మనసారుం డిచటన్
గానంబడఁ డది కన్నుఁగవపైన్
మానంబుగ సుమమహిమను నెఱుఁగన్;
గోనంతయుఁ గడుఘోరముగను జన
హీనం బయి రవహీనత నిశి తగు

క. అలికిడి యెవరిదియో సుమి !
బలె ! యితనిది వస్త్రవితతి పరఁగున్ మనపా
రులవసనంబులకీతిన్;
గలహించినవాఁ డితండె కన్యామణితోన్.

కన్యక యీపెయే కడుమోహవివశ
యన్యముఁ గోరకే యచలపై నొరగె.
ఎంతశుద్ధాత్మయో ! యీమూర్ఖుపజ్జఁ
బంతపుంబ్రేమతోఁ బండ దీయువతి.
క్రూరుఁడా ! నీకంటెఁ గ్రూరంపురసము
జారఁగాఁబూనెదఁ జక్షుస్సుమీఁద.

ఈరసమహిమల నీవె చూచెదవు
కారుకూఁతల మాని కామాంధవిధము
పోయెద; నాకార్యపూర్తి యయ్యె నిఁక;
మాయలభైరవుమహిమఁ జేర్కొనుచు.

[నిష్క్రమించును.]

[ధామాత్రేయుఁడును శీలినియుం బరుగెత్తుచుఁ బ్రవేశింతురు]

శీలిని:- ప్రియా! ధామాత్రేయా! నీవు నన్నుఁ జంపినను సరే; పరుగెత్తక యాగుము.

ధా:- వెడలుము; ఖండితముగాఁ జెప్పుచున్నాఁడనుసుమీ! దయ్యమువలె నన్ను వెంబడింపకుము.

శీ:- హా! ఈచీఁకటిలో వదలిపెట్టిపోదువా? అట్లు పోకుము.

ధా:- ఆగుము నీవే; వినకుంటివేని, నీగతి నీది; నే నొంటరిగానే పోకతప్పను. [నిష్క్రమించును.]

శీ:- హా! హా! ఇట్లు మోహాశాబద్ధనై పరుగెత్తుటచే నా కూపిరిసెలుపుట లేదు. నే వేఁడుకొన్న కొలఁది, ఆతని నిరాకరణము హెచ్చుగుచున్నది. హేమియయి యెచట నున్నను, సుఖవంతురాలే; ఆమెనేత్రములలో నట్టిధన్యతయు నాకర్షణశక్తియు నున్నవి. ఆమెనయనద్వయమున కాయద్వితీయప్రకాశశక్తు లెట్లుకలిగెనో! నాకువలె నుప్పటికన్నీటిం గార్చుటచేతంగాదు. అట్లైనచో, నావంటి చిరతరబాష్పాకులలోచన యీాప్రపంచమున లేదు. చీ! కాదు. నే నొకభల్లూకమువంటికురూపను; ఇతరజంతు

వులే నన్నుఁజూచి పాఱిపోవుచున్నవి; కనుక, ధామా తేఁ యుఁడు కురూపనగునన్ను వదలి పరుగెత్తుట వింత కాదు. ఏవికారవుటద్దముననో చూచుకొని నానేత్రముల నాపె నయనములకుఁ బోల్పనుంకించితిని. గాని, — ఈతఁ డెవఁడు? లవచంద్రుఁడా? నేలమీఁదనే! — చచ్చి పడెనా! లేక, గాఢనిద్రయా! - రక్తముగాని, గాయము గాని, ఎక్కడను గానరాదే.

లవచంద్రుఁడుగారూ? సజీవుఁడ వేయైనచో మేల్కొనుము.

లవ:- (నిద్రలేచుచు) నీసాన్నిధికొఱకు ననలనదమునైన దాటుదును. విశుద్ధశీలినీ! స్ఫటికనిర్మలా! నీయంతరంగ పారిశుద్ధ్యమును నీప్రకృతియే ప్రకటించుచున్నది. ధామా తేఁయుఁ డెక్కడ? ఆఘోరనామునినో యీకృపాణ మునకు నిపుడే బలియిచ్చుచుంటిని.

శీ:- లవచంద్రా! అట్లనకు; అట్లనకు. ఆతఁడు నీమనఃప్రియ యగుహ్రీమయిని మోహించినను, నీకే హానికలిగె! హ్రీమయి నిన్నే వలచుచున్నదిగదా! నీ కత్యాప్తియేల?

లవ:- హ్రీమయిమీఁదిత్యాప్తియా! అట్లనకుము. ఆమెతోఁ గడపిన యాదీర్ఘలిప్తలకుం బశ్చాత్తాపమొందుచున్నాఁ డను. నాకు హ్రీమయిమీఁద మోహ మిపు డిసుమం తయు లేదు; ఇపు డీశీలినినే మోహించుచున్నాఁడను. కాకిని వదలి పావురము నెవఁడు స్వీకరింపఁడు. మనుజుని యిచ్ఛాశక్తి తుదకు హేతువుష్టబుద్ధిశక్తికే వశమగు చుండును. నాహేతువివేచనమే నీవు యోగ్యతరవని నిశ్చ

యించినది. పెరిగెడి సమస్తవస్తువిస్తరమును గాలపరిపాక దశకే ఫలవంతమగును గదా! కావున, నేను చిన్న తనపుఁగ్రిందుమీఁదు లనుభవించి, కాలపరిపాకముచే జ్ఞానోన్నతిని సాధించి, దానికే భావసైన్యాధిపత్యము నిచ్చి, నాయిచ్ఛ నానాయకు ననుసరింపఁ జేసితిని ; నాజ్ఞాన శక్తి నీనయనములనే పయనమై చేరి, వానియందునుండి క్రింది కాముని మోహకథల వ్యర్థత్వమును గమనించుచున్నది.

శీ:- ఈచుఱుకైన వెక్కిరింపుములుకుల కీనాజన్మ మేలగురి చేయఁబడుచున్నదో! ఈనీవెక్కిరింపులకుం దగులోప మెప్పుడైన నిదివఱకు నాచేఁ జేయఁబడెనా? ధామాత్రే యుని వశపఱచుకొనలేని నాలోపములను నీవే యప్పు డవు డుగ్గడించినవిషయము, ఓయువకుఁడా, నావలనఁ దప్పులేమికి నిదర్శనముగఁ జాలదా? నన్ను నీ విపుడు వరించితిననుచు వెక్కిరించుట నీకు బొత్తుగాఁ దగనిపని, బొత్తుగాఁ దగదు. కాని, చాలును; ఈశ్వరుఁడు నిన్నుఁ గాపాడుఁగాక! సెలవొసంగుము. కాని, నీవింతకంటె గౌరవార్హుఁడవని తలంచియుంటిని. అక్కటా! నే వరించినవరుఁడు నన్నుఁ బరిత్యజించుటకుఁదోడు పరపురుషునిచే వెక్కిరింపఁబడుటకూడ సంభవించె! (నిష్క్రమించును)

లవ:- శీలిని హ్రీమయిం జూడలేను; మెఱుఁగే. హ్రీమయీ! అక్కడనే నిద్రించుచుందుము. లవచంద్రునిసమీపమునకే యెప్పటికిని రాకుము. మిఠాయీలతోఁ గడుపునిండినమీఁదఁ బ్రీతివస్తువును జేఁదగువిధమునను, మత

భ్రష్టులు పరిత్యజించినమతావలంబకులచే గర్హితులగు రీతినను, నాకు మోహాజీర్ణబాధను నీయెడ హేయతను, గలిగించిననీవు, సర్వులచే గర్హింపఁబడెదవుగాక ! నాచే ముఖ్యముగా ! నాసమస్తచిత్తశత్రులారా ! మీయావత్స-తులతోను శీలిని గౌరవించుటలో నామెను ఎరించుటలో నీమోధునిబాధలం దొలఁగించి తోడ్పడుదురుగాక !

(నిష్క్రమించును)

స్త్రీ:- (మేల్కొనుచు) లవచంద్రా ! రక్షింపవా ! రక్షింపవా ! నాయెదమీఁదినుండి యీప్రాకుసర్పము నుండి కాపాడి నెట్టిపోవా ? ఎట్టివింతకల ! అయ్యో నాగతి ! లవచంద్రా ! నాయీశరీర మెట్లు వణకుచున్నదో చూడుచూడుము ; ఒకసర్పము నాహృదయమును గొఱికికొనుచున్నట్లును, నీవు చిఱునవ్వుతోఁ జూచుచున్నట్లును గలకంటిని. లవచంద్రా ! ఏమి ? మాయముచేయఁబడితివా ? నాథా ! పలుక వేమి ? నామాటలు వినఁబడుటలేదా ? పోయితివా ? జాడయు జవాబును లేవే ! అయ్యో! ఎందుఁబోయితివి? వినఁబడినచో దయచేసి పలుకుదూ ? నీమోహావేశ మెంతవేషము వేసె ? పలుకవా ? నాకు భయదుఃఖములచే మూర్ఛవచ్చునట్లున్నది. కాదు; కాదు. ఈతఁడు సమీపమున నున్నచోఁ బలుకుచుండెడి. నిన్ను వెంటనే గానలేనిచో, మరణమే నాకిఁక శరణము.



# మూఁడవయంకము.

మొదటిరంగము.

(అర్థనిశాపురి ప్రాంతమందలియడవి.)

[త్రిధన్య నిద్రించుచుండఁ గిమ్మయ్యఁడు మొదలగుపని వాండ్రు ప్రవేశింతురు.]

భూతబుద్ధి:- మనవారు సర్వులు వచ్చినారా ?

కిమ్మ:- సకాలమునకు నందఱును వచ్చినారు. మన కిక్కడ మిక్కిలిచక్కనియనుకూలస్థలము మనశుష్కనాటకకలాపమును సాధనచేయుటకు దొరికినది. ఈపచ్చనినేలయే మన కిపుడు రంగస్థల మనుకొనుఁడు. ఈపొదరిల్లే మనము వస్త్రముల ధరించుగది యనుకొనుఁడు. రేపు ప్రభువుగారి సన్నిధిలో మన మెట్లాడవలయునో యట్లే యనుకొని సాధనచేయుదము.

భూత:- కిమ్మయ్యా ! —

కిమ్మ:- నీవు చెప్పఁదలఁచిన దేమి ?

భూత:- ఈనాటికలో, విరామదిశాబీల ప్రహసనములోఁ బ్రేక్షకులను మెప్పించుటకువీలుగానియంశములు కొన్ని యున్నని ; మొదటిది, విరాముఁడు కత్తితోఁ దననే పొడుచుకొనవలయును ; స్త్రీమండలి దానినిఁజూచి సహింపఁజాలరు. ఈచిక్కునకు నేనిఃసమాధానము నిత్తువు ?

కిమ్మ:- పరదేవి సాక్షిగా, నిజముగా నది గొప్పతప్పనఁదగు చిక్కే.

తారాలింగయ్య:- అంతయుం జెప్పి, తుదకుఁ జంపుకొనుటను మనము ప్రదర్శింపరాదు. ఇది నాసిద్ధాంతము.

భూత:- అవసరము లేదోయి ! చిక్కులేనియొకయుపాయమును జెప్పెదను ; వినుఁడు. నాకు నొకప్రస్తావన వ్రాసియిండు ; దానిలో మాకర్తులతో మే మెవ్వరికి నెట్టిహానియుం జేయము ; విరాముఁడు నిజముగాఁ జంపఁబడఁడు : అంతకంటె విస్పష్టముగా "నేను నిజముగా విరాముఁడను గాను, భూతబుద్ధి యనునేఁతపనివాఁడనే" యని చెప్పినచోఁ దప్పేమి ? వారిభయ మంతయుం బోవును.

శిమ్మ:- మంచిమాటయే. ఒకప్రస్తావనను షడష్టాక్షరచ్ఛందస్సుల బంతులుగ వ్రాసెదను.

భూత:- షడక్షరచ్ఛందస్సు లేకుండ నన్నియు నష్టాక్షరములుగనే చేయుట మెఱుఁగు.

చణాటుఁడు:- మఱియొకటి, మనసింహామును జూచి స్త్రీలు భయపడుదురేమో !

తారాలింగయ్య:- నాకును దానింగూర్చి సంశయభయములున్నవి.

భూత: నామిత్రములారా ! మీరు బాగుగా యోజింపవలసినసంగతియే యిది. స్త్రీప్రేక్షకులమధ్య నొకసింహామును జూపుట మిక్కిలి భయజనకమే ! భగవంతుఁడే మనకు శిక్ష లేకుండ రక్షించుఁగాక ! బ్రతికియున్న సింగముకంటె

భయంకరతర మగుకుక్కుటపుజాతి యున్నదా ? ఆసంగతి పనము బాగుగా యోజింపవలయును.

చణా:- కనుక, మఱియొకప్రస్తావన వ్రాసి, దానిలో సీతఁడు నిజమైనసింహమని తలంపకుఁడని బోధింపవలయును.

భూత:- అది చాలదు. అతనిపేరును జెప్పి, సింహపుంగంఠభాగముద్వారమున నాతని మనుజముఖభాగమునుగూడఁ గొంతచూపుట మెఱుఁగు ; అంతమాత్రమును జాలదు ; ఆతఁడే యేదోయొకవిధముగా నిట్లో యీ తాత్పర్యము వచ్చునట్లో లోపమో యారోపణమో చూపవలయును :- "నారీమణులారా ! అథవా, సొగసుకత్తెలారా ! మీరేమాత్రమును భయపడఁబనిలేదు ; మీప్రాణములకు నా ప్రాణ మడ్డుపెట్టెదను." అని వినయపూర్వకముగా మీకు మనవిచేయుచున్నాఁడ ; మిమ్ముఁ బ్రార్థించుచున్నాఁడ; మిమ్ము వేఁడుకొనుచున్నాఁడను. నేను జీవింపఁ గోరితినేని, ఈమీసన్నిధిలోనికి సింహమునై వత్తునా ? నేను సింగమును గాను; అందఱవలె మనుజుఁడనే." అంతట,స్పష్టతరముగా నేను శిశునాగుఁడను వడ్రంగి"నని చెప్పుకొనవలయును.

కిమ్మ:- మంచిది; అట్లే చేయుదము. కాని, మఱిరెండు కష్టపరిదర్శనము లున్నవి. ఒకటి, గదిలోనికి వెన్నెల వచ్చునట్లుచేయుట. మీ రెఱుంగుదురుగదా ! పిరామదిశాబీలు వెన్నెలలో నెదురగుదురు.

చణా:- మన మాడునాఁడు వెన్నెలయుండునా ?

భూత:- ఏది పంచాంగము ! ఏది పంచాంగము ? లేక, జం త్రియో ? వెన్నెలసంగతి చూడుఁడు, చూడుఁడు.

కిమ్మ:- అవును. ఆరాత్రి వెన్నెల కలదు.

భూత:- అయితే, చిక్కే లేదు. కిటికీతెక్క యొక్కటి మన మాడఁబోవురంగస్థలములోనికి వెన్నెలవచ్చునట్లు తెఱచి యుంచవలయును.

కిమ్మ:- సరే; లేకుంటే, మనలో నొకనిచేతికి నొకలాంతరును, ముండ్లకంచెతున్కను, ఇచ్చి, చందమామయ్యలోని ముసలయ్య యీయనయే యనిచెప్పించిన బాగుగ నుండునుగా. రెండవకష్టప్రదర్శన మేమనఁ — రంగస్థలము మధ్య నొకగోడకూడ నుండవలయును. ఏలన: విరామదిశాబీలు గోడపగులులోనుండి సంభాషింతురుగదా కథలో.

చణా:- గదిలోనికి గోడ నెట్లు తేఁగలరు; అసంభవము. భూత బుద్ధీ! నీయభిప్రాయ మేమి ?

భూత:- ఎవఁడో యొకఁడు కుడ్యపాత్రను స్వీకరింపవలయు. సున్నమునో, సుద్దనో పూసికొని, విరాముసకును దిశాబీకిని మధ్య నిలిచి తనవేళ్లసందుల నిట్లు చూపుచు, ఆసందునుండి విరామదిశాబీల గుసగుసల సాగింపుమనవలయును.

కిమ్మ:- ఆచిక్కుకూడఁ జక్కఁబడినయెడల, అంతయుం గుదిరినట్లే. ఇఁక రండు ; కూరుచుండుఁడు ; మీమీభాగముల

నొప్పగించుఁడు. విరాముఁడా ! నీ వారంభింపుము. నీవు నీభాగము నొప్పగించినతోడనే, ఆపాదరింటిలోనికిం బొమ్ము ; ఇట్లే, అందఱు నొప్పగించుచు వారివంతు కాఁగానే పోవుచుండవలయు.

(వెనుకనే పుష్కరుఁడు ప్రవేశించును)

ఎట్టిమొద్దుపనివాం డిక్కడ మాభూతరాజ్ఞియుమ్యేల ప్రక్కనే చేరి యల్లరిసాగించినారు ? ఓహో ! ఒకనాటక ప్రదర్శనపు శుష్కపీఠికయా ! నేనును ప్రేక్షకుఁడనై విందునుగాక ! హేతువుం జూతునా, నేనును బహుశః పాత్ర నగుదును.

కిమ్మ్ర:- విరాముఁడా ! మొదలుపెట్టుము. దిశాబీ, నిల్వఁబడుము.

భూత:- దిశాబి ! యీనీబువంపువాసన
లోసీ ! మనోహరతమంబులే !

కిమ్మ్ర:- "బువంపు" కాదు ; "సుమంపు" అని దిద్దుకొనుము.

భూత:- సుమంపువాసన లోసీ ! మనోహరతమంబులే.
కృశానుకణములఁ గృశించునూదులు
నోసీ ! సమంబులె ? దిశా ! ప్రియే !
ఒసీ ! యొవంఛో ! వినంగఁదగుసుమి !
యొకేక్షణం బట నిలంబడన్,—
అసింట నాతనిఁ దోలంగఁబంపుచు
నదేక్షణం బిటకు వచ్చెదన్ ॥

(నిష్క్రమించును)

పుష్క:- వహ్వా ! ఏమిశృంగారరసము ! ఎంతవింతగ విరామ పాత్రి పోషింపఁబడినది !

పుత్తుఁడు:- ఇఁక నేనే రావలయునా ?

కిమ్మ:- ఆహా ! బాగుగనున్నదే తెలివి ? నీవా రావలసినది ? కాదు. ఏదోశబ్దము వినఁబడఁగా, పోయిచూచి, ఆపురుషుని నెచ్చటికైనఁ బంపి, తిరిగి వచ్చును. నీవు నీభాగము నివు డొప్పఁజెప్పవచ్చును.

పుః- ప్రికాశమానుఁడ ! విరామవిభుఁడా !
పరికృష్టగారము భవత్కళా
వికాస మబ్జపుదళంబులకు సరి,
విలాసవంతుఁడ ! యొకప్పుడో
సకారణంబుగ విరక్తపాటల
సమత్వ మొందెడు జయాస్యదా !
నకామత న్నను నిన్నిగోరికడ
జరూరు కలిసెద విరామఁడా !

క. చురుకైనయౌవనంబున
పరకాముని మోముసొగసుఁ బరులకుఁ గలవే
బొరపడనికదపు ఘోటక
వరమె ట్లలయికను గనదొ వర ! నీవళ్లే.

కిమ్మ:- "నిన్నిగోరి" కాదు. "నైనస్టాంబ్" అనవలయునోయి! ఈమాట విరామునిపై వాక్యమునకుం బ్రిత్యుత్తరముగాఁ జెప్పవలయును. నీవు సర్వభాగమును బాఠము నొప్పఁ

జెప్పెడిరీతిఁ జెప్పరాదు. ఈమాటకుం బూర్వమే విరా
ముఁడు వచ్చి మాట్లాడవలయును.

ప్లు:- (దిద్దుకొనుచు) "పొరపడనికదవు ఘోటకవర మె ట్లలయి
కను గనదో వర! నీవట్లే".

[పుష్కరుఁడును గాడిదెతలతోడి భూతబుద్ధియుం బ్రవేశింతురు]

భూత:- నిజముగ నే సుందరుఁడనె
యజుఁ డట్లే వ్రాసినట్లె యగుదుఁగ వరుఁడఁగ॥

కిమ్మ:- (భయకంపితుఁ డగుచు) ఓహో! ఎంతటివికారము!
ఎంతయాశ్చర్యము! ఇది దయ్యాలనేల! లెండు! దయ
చేసి పాఱిపోదము, రండు. ఇఁక దిక్కెవరు మనకు?

[పుష్కరుఁడును భూతబుద్ధియుందప్పఁ దక్కిన వా
రందఱును నిష్క్రమింతురు.]

పుష్క:- నేను మీవెనుకనే వచ్చుచున్నాఁడ. మిమ్మేఁ
గొంతవఱకుఁ దిప్పలుపెట్టి త్రిప్పనిది వదల. బురదలలోను,
బొదలలోను, ముండకంచెలలోను, దిరిప్పుచు—ఒకప్పుడు
గుఱ్ఱపురూపముతోను, మఱియొకతఱి వేఁటకుక్కవలెను,
ఇంకొకసారి పందియాకృతితోను, వేఱొకమాఱు భల్లూ
కపువేసముతోను, లేక, కొఱవిదయ్యమురీతిగనో గాన్పించి
విసికించెద. (నిష్క్రమించును)

భూత:- నన్నుఁజూచి వీ రేలపరుగెత్తుచున్నారో? నన్నుఁ
గాంచి భయపడిపోవుట వీరికొంటెతనము.

[చణాటుఁడు తిరిగి ప్రవేశించును]

చణా:- ఓభూతబుద్ధీ! నీ విట్లేలమాఱిపోతివి? నీతలమీఁద నిదేమి?

భూత:- నీ కేమికనఁబడుచున్నది? నీమొద్దుగాడిదతల కాన్పించుచున్నదా?

(చణాటుఁడు నిష్క్రమించును.)

(కిమ్మయుఁడు ప్రవేశించును)

కిమ్మ:- భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక! భూతబుద్ధీ! నీ వొకరూపాంతరముం జెందినావుసుమీ!

(నిష్క్రమించును)

భూత:- (తనలో) వీరికొంటెతనము నాకుఁ దెలిసినది; వీరందఱును గూడఁబలుకుకొని నన్నొకవెఱ్ఱిగాడిదను జేయఁదలఁచినారు; వీరైన, భయపెట్టుప్రయత్నము లివి. వారెంతకొంటెతనముం జేసినను, నే నీచోటును వదలను. ఇచ్చటనే ముందునకును వెనుకకును బచారిచేయుచుం బాడుచు నా కేమాత్రమును భయభ్రాంతులు లే వను కొనునట్లు చూపెదను.

పాట

చక్కని నల్లని ఱెక్కలు గలవియుఁ
గుక్కుటజాతివి కొన్ని పులుంగులు,
నారంగపురంగారెడిముక్కులఁ
బారెడియాగతి పక్షివిశేషాల్,
వంపులఁ దొఱ్ఱల వడ్రఁగిపిట్టలు,
కొంపలచెంతలఁ గూసెడిపిచ్చుక

లందపుఁబల్కులయలికిడి కోయిల
లెందు భరద్వాజేద్యపతంగము
లలసట దీరఁగ నాకసమునకై
చలనముఁ జేయుచుఁ జక్కఁగ నెగురునొ
యాయడవులఁ గని యన్నిటిఁ బెంచెద
నేయజుఁ డిచ్చును హితమతి పీనికి ?—

త్రి॰:- ఈసుమశయ్యఁ బరుండిన నన్నే వేలుపో యీమేలు కొలుపులతో నిద్రలేపుచున్నది ! ఆహా ! ఏమిగానరసము మనుజవరా ! తిరిగి యొక్కసారి దయచేసి పాడుము. నీగాయకశక్తి నాశ్రవణేంద్రియము నాకర్షించినది. నీస్వరూపలావణ్యాదులు నానయనములం గట్టివైచినవి. నీనైతికశక్తి నిన్నొకపర్యాయము చూచినమాత్రమున నాభావపరంపరను భావజువశముచేసినది.

హూత:- అంగనా ! నీ వట్లంత మోహావశ వగుటకుం గారణ మెయ్యదియో తోఁపకున్నది. కాని, నిజముచెప్పువాఁడ ! ఇకాలములందు జ్ఞానశక్తికిని మోహాంధతకును సాన్నిధ్యమేపొసఁగదు ; సరేగదా ! ఇరుగుపొరుగుమిత్రబృందముకూడఁ గాలుష్యమును విరిచి స్నేహముంగూర్పఁజాలరు. నేనుగూడఁగొంతహాస్యము చేయఁగలను, లే ;

త్రి:- నీసౌందర్య మెంతసాటిలేనిదో, నీజ్ఞానశక్తియు నంత నిరుపమానము.

హూత:- నీస్తుతి విపరీతము ; నాకు నీవు వర్ణించుచునున్నతి రెంటను సున్నయే. అంతదూరపుందెలివి యట్లుంచుము ; ఈద

య్యాలయరణ్యమునుండి తప్పించుకొనిపోవు నుపాయము మాత్రము నాకుందోఁచిన నేను ధన్యతముఁడ ననుకొందును.

త్రి:- ఈవనరాజమును దృజించిపోవఁదలంపకుము ; నీవిక్కడ నుండకతప్పదు ; నీవు పారిపోవఁజూచినను, నేను బ్రతిబంధింపక తప్పనుసుమీ ! నాశక్తి నేమని తలంచుచున్నావో ! నే సుపర్వజాతిదానను; వసంతాధిపతులగు మధుమాధవులు నాకు నెల్లప్పుడును వశవర్తులై మెలంగుదురు. నిన్ను మోహించితిని: కావున నాతో నిండుండక తప్పదు నీకు. నాక్రింది భూతగణములచే నీకు నూడిగముఁ జేయించెద; కొందఱు పోయి నీకుకోరెడిముక్తికాదరత్నముల రత్నాకరమునుండి యేరి, కొనివత్తురుసుమీ ! నీకుం గొందఱు కుసుమశయ్యల నమర్చి జోలలుపాడి జోకొట్టుదురుసుమీ ! నీమనుజజాతిదోషములంబోఁగొట్టి వాయుమయమగు భూతజాతిగ నిన్ను మార్పఁగలదానను సుమీ! అతసీకుసుమాదిసుమనివాసినులారా ! ఇటురండు.

బటాణిపూవుది:- సిద్ధముగ నున్నాను.

ఆవపూవుది:- హాజరై యున్నాను.

అందఱును:- అందఱము సిద్ధముగ నున్నాము. మే మెక్కడకుఁ బోవలయును ?

త్రి:- ఈమహాపురుషుని దయతో భక్తితో గౌరవించుచుండవలయును. ఈతనితనువుం గాపాడుచు వెన్నంటి కొలువు చేయుచుండవలయును; ఈతని యెదుట నాట్యగానశక్తులం

జూపవలయును; ఈతనికి సకలసుమసారమరందముల నందంద వెదకి తెచ్చి యందఁజేయవలయును. పండిన ద్రాక్షలను, హారితాంజూరఫలములను, తీయని పిప్పలి పండ్లను, తేనెటీగల సొమ్మగు మధురసమ్మును, నాప్రియునకుం దెచ్చియిచ్చి, రాత్రులు నిద్రపట్టువఱకుఁ దేనె మైనముతో మిణుంగురుంబురువుల కన్నులకడ దీపములఁ వెలిఁగించి నిదురపుచ్చుచు మేలుకొలుపుచు నుండవలయును; ఆతఁడు నిద్రించుతఱి వివిధవర్ణముల సీతాకోక చిలుకపురుగుల ఱెక్కలతోఁగట్టిన వ్యజనములతోఁ జలి వెలుంగుబాధ తొలఁగింపవలయును; పర్యవసానమేమన, ఆతనికన్నుసన్న నెఱింగి మన్ననతో నాతని సేవ చేయుచుండవలయును.

బటాణిపువ్వు మొదలగు భూతములు } చిత్తము; ప్రభువర్య!

భూత:- కనికరముతోఁ దామందఱు నన్ను రక్షింపఁబ్రార్థన. నాతో నెక్కువ మక్కువతోఁ బరిచయముం గలిగించుకొనవలయును. మీమీ నామధేయములం దెలుపుఁడు.

భూతములు:- చిత్తము! నాపేరు బటాణిపువ్వు.
నాపే రావగింజ.

తిత్రి:- వచ్చి, ఈతని సొంపూవుందీగెల చప్పరముం జేర్పుఁడు. చందమామ యెందునకో. నీరుకమ్మిన నయనములం జూపుచున్నాఁడు; ఆతనితోఁబాటు ప్రతి కుసుమంబును గన్నీరు గార్చుచునే యున్నది; ఫలరూపపరిణామము

కొందఁజాలని సుమము లేడ్చుచుండుట వింతయగునా! మాటలఁగట్టిపెట్టించి, మీరీతనిఁ గొనిరండు ; నిశ్శబ్దముగా సుమీ.

### రెండవరంగము.

[ఈయడవిలోని మఱియొకమూల- భైరవుఁడు ప్రవేశించును.]

భైర:- (తనలో) త్రిధన్య యీలోపల నిద్రలేచి, దేనినోగాంచి, దానిమీఁదఁ బట్టఁజాలని మోహావేశసముద్రమున మునిఁగియుండును.

(పుష్కరుఁడు ప్రవేశించును.)

నాకాలరివచ్చుచునే యున్నాఁడే. (పుష్కరునితో) ఏమి! విశేషాలు? ఈభూతాలతోపులో నే కట్టుదిట్టములం జేసివచ్చితివి ?

పుష్క:- మారాణిగా రొకకురూపిని మోహించియున్నారు. ఆమె పరుండులతామంటప సమీపమునఁ బనివాండ్రు కొంద ఱీనగరశాలలంబనిచేయు మోటజనులు కూడి, రాఁబోవుప్రభువివాహోత్సవమున నాడఁదలంచిన నాటికను శుష్కాభ్యాసము చేయుటకై రాణిగారు నిద్రించుతఱి వచ్చి విచ్చలవిడిగ నల్లరిచేయుచుండిరి. ఈమోటమూకలోని మూర్ఖతముఁ డొకఁడు విరామపాత్రను స్వీకరించి, తనభాగము నొప్పగించుచు నాగి దాపుననున్నయొక పొదరింటిలోఁ బ్రవేశించినాఁడు ; ఇదే సమయ మని

యాతని తలను మార్చి యొకగాడిదతల నతికించితిని. దిశాబి వేసమువాఁడు తనభాగము నొప్పఁజెప్పుటతోడనే, ఈతఁడు వచ్చి తనప్రత్యుత్తరభాగము నొప్పఁజెప్పవలసి రాఁగా, ఈనాగాడిదతలగల కుహూపి వారిలోఁ జేరును. తక్కిన పనివాండ్రిందఱును, విస్మితులై యీతనిఁజూచుట తోడనే పారిపోవుదురు; అడవిబాతులు పులుఁగులంబట్టు బోయనుజూచి పారిపోవునట్లును, తుపాకిచప్పుడు వినుట తోడనే కాకు లఱచుచు నలుమొగంబులం బరచునట్లు, పనివాండ్రిందఱు భయపడి మాయడుగుల చప్పుడునకే యొకరిమీఁద నొకరు తత్తరపాటుతో బడుచుండిరి. ఒకఁడు చచ్చితిమనుచు సఱవసాగెను; మఱియొకఁడు మాకు దిక్కెవ్వరనుచుం బౌరులం బిల్వసాగెను. ఇట్లు బలిష్ఠమగు భయముచే బుద్ధిశక్తి దుర్బలత్వమునొంది, అచరప్రకృతి చేతఁగూడ బాధితులగుచుండిరి. ముండ్లకంచెలు, పొద లును, వారిదుస్తులను గుంజుచుండ, కొందఱు తమటోపీలం గొందఱు చొక్కాలను బోఁగొట్టుకొనుచుండ నందఱిని బెడదారిం ద్రోసితిని. విరామవేషధారినట్లక్కడ ఖరశిరస్సు తోఁగులుకుమనివచ్చినతోడనే తిత్రిధన్యగారు నిద్రలేచి, తుద కీగాడిదనే మోహించినదాయె.

శైర:- నేఁదలంచినదానికి మించిన వంచనయే గలిగించి నేర్పున మించితివి; కాని, నేఁజెప్పిన రెండవపని నెట్లు చేసితివి! ఆపౌరునికను రెప్పలమీఁద నారసమును బూసితివా?

పు:- ఆతఁడు నిద్రించుచుండ వీలుకనిపెట్టి యీస్త్రీ ప్రక్కన నుండఁగనే రసముం బూసితిని; నిద్రలేచుటతోడనె యీపెను జూడకతప్పదు.

[హ్రీమయియు ధామాత్రేయుఁడును బ్రవేశింతురు.]

భై:- దగ్గరకు రమ్మా. ఈతఁడే నేఁ జెప్పిన పౌరుఁడు.
పు:- నేను బూసిన దీతనికనురెప్పలమీఁదఁ గాదు. నేఁ గాంచిన స్త్రీ యీపెయే.

(పుష్కర భైరవులు వినుచుందురు)

ధా:- ఓసివెఱ్ఱిదానా! నిన్నింతగా మోహించినవాని నేల నీ విట్లు తిట్టుచున్నావు? నీశత్రువు నట్లు దూరఁదగును.
హ్రీ:- నేనిదివఱకుఁ బొడిచీవాట్లే పెట్టితిని; కాని, ఇఁకమీఁద నిన్ను సహేతుకముగ శపించితీరుదును. లవచంద్రునిఁ జంపి యాతనిరక్తమున నడచివచ్చినచో నన్నుఁగూడఁ జంపుము. అహర్పతి సత్యప్రకాశమువంటి సత్యముతో నాతోనాతఁడు మెలంగెను. అతఁడేమి? నిద్రపోవు నన్ను వదలి పోవుటయేమి? సూర్యచంద్రుల చలనములు వ్యత్యస్తములైనను, ఆతని సత్యసంధతాదులు వ్యత్యస్తము లెప్పటికినిగావు. నీవాతనిం దప్పక చంపితివనియె నాతలంపు; కానిచో, నీచూపు లట్లేలయుండును?
ధా:- చంపఁబడినవాఁడు నట్లే ప్రాణశక్తిహీనుఁడై కనఁబడును; నీనయనసాయక నిహతుఁడనైన నాగతియునట్లే;

నీక్రూరవీక్షణబాణములు నాహృదయములో గుచ్చుకొని నన్ను నట్లే బాధించుచున్నవి; కాని, హింసించుచున్న నీవో, ఆశుక్రమండల మట్లు కళకళలాడుచు వెలుఁగు చున్నదో, అట్లే ప్రకాశించుచున్నావు.

హేమ:- లవచంద్రునిక్షేమమునే యడుగుచుండిన నాయెదుట నిట్లు పేరెదవేల? ఆతఁడెక్కడ? అయ్యో! దయ యున్నచో నిప్పటికైన నాతని నాకు వదలియిమ్ము.

ధా:- నే నాతనిశవమునుగూడ నావేఁటకుక్కలకే యిచ్చెద.

హేమ:- ఛీ; పో; కుక్కా! కన్య కుండఁదగినసహనసౌభాగ్య తలను మితిమీఱి కొనకుఁ దెచ్చుచున్నావు. అయిన, నీవాతనిఁ జంపివైచితివా? ఏమి? ఇఁక నిన్ను మనుజ జాతిలోఁ బరిగణింపవీలులేదు. అయ్యో! ఓరి! దుర్మార్గ ఘాతకుఁడా! ఇప్పటికైన నిజమును జెప్పవేమిరా? అతఁడు మేలుకొనియున్నపుడు నీవు,అట్టిధీరుని, సమీపింపఁగలవా? ఆతఁడు నిద్రించు సమయమున సమయించితివా? ఏమి? ఎంతటి ధీరఘాతకుఁడవురా? ఒక విషసర్పముకూడ నిద్రించువానిం జంపదనుకొనెదను. నీసర్పతుల్యములగు కోఱలకో యాశీవిషములవిషమును మించినవిష మున్నది.

ధా:- నీయాగ్రహాటోపమును వ్యర్థముగఁ బొరపడి నామీఁదఁ జూపుట వ్యర్థము. నేను లవచంద్రుం జంపిన వాఁడను గాను; నాకుఁదెలిసినంతవఱ కాతఁడు చావలేదు.

హేమ:- దయచేసి, అతఁడు కుశలమని యిఁకనైనఁ జెప్పఁ దాఁటా?

ధా:- నే నట్లు చెప్పిన నది నాకెట్లు లాభించును ?

హి:- అల్లాగో ! నాకంటఁబడని భాగ్యమే ; నాకును నీస్నేహసాన్నిధ్యము తొలఁగిపోవును. ఆతఁడు బ్రతికియున్న నేమి, లేకున్న నేమి ? నీవు నాకంటఁబడకుము.

(నిష్క్రమించును.)

ధా:- ఇట్టి తీక్ష్ణకోపావేశముతోనున్న యీపె వెంబడిపోవుట తగదు; కనుక, ఇక్కడనే కొంతసేపు నిలచెదఁగాక ! అసలే దుఃఖభార మెంతో సహింపరాని స్థితిలోనుండ నిద్రాదేవి బాకీపడియున్న భారముకూడఁ గలిసి దుర్భరతర మగుచున్నది; ఈవచ్చుచున్ననిద్ర కొంత భారముం దీర్చివేయునేమో ! అందునకై, కొంతవట్టి కిక్కడనే నిరీక్షించెద ? (పండుకొని నిద్రించును.)

భైర:- పుష్కరా ! ఎంతపొరపాటు చేసితివి ? నేనిచ్చిన రసమును మోసపుచ్చనివాని నేత్రముమీఁదఁ బూసితివి, సుమీ ! అందుచేత మోసగాఁడు మోహావశుఁడగుటకు బదులుగ మోసము లేనివాఁడు పెడఁదిరుగును.

పు:- నాలోపమదికాదు ; వారిదురదృష్టమహిమ యది. లోకమున నొక్కయేకపత్నీవ్రతునకు లక్షలకొలఁదిగఁ బోకిరు లుందురుకదా !

భైర:- కనుక, వేగముతోఁబోయి, అర్థనిశానగరవాసినియగు శీలినిఁగాంచి, ఆమె విరహబాధచే నిష్కళయై నిట్టూర్పులతోఁ బాలిపోయి యుండునుగాన గురుతుపట్టఁగలవు.

ఏయుపాయముచేతనో యీతనియెదుటికి నాపెను దీసికొని రావలయును. నే నీతనినేత్రములమీఁద రసమును బూసి సిద్ధముగ నుందును.

పు:- ఇదె, పోయివచ్చితిననుకొనుఁడు. సాయకవేగముకంటె వేయిమడుంగు లెక్కువవేగముతోఁ బోయివచ్చెద.

(నిష్క్రమించును.)

భైర:- దాకగుత్తుల వర్ణంపు తథ్యరసమ !
యాకుసుమసాయకునిచేతి యంబకంబ !
యీకుమారునికన్నుల నింక నితఁడు
వేఁకువం జూచు నకాంత వెంబడించి,
పోకుపోకుమ్మటంచు సంపూర్ణమోహ
పాకటత్వముఁ జూపుఁ జిత్రింపురీతి.

[పుష్కరుఁడు ప్రవేశించును.]

పు:- భూతసేనాపతీ ! ఇక్కడ సమీపముననే శీలినియున్నది ; నేను బొరపడి రసముపూసిన యువకుఁడును మోహతన్మయుఁడై యామెపక్కనఁగూడి వేఁడుకొనుచున్నాఁడు. వారి సరససల్లాపముల విందమా ! మనుజజాతి యెంత మోహవశము !

భైర:- దూరమున నుండఁదగు. వారిశబ్దములకు ఘామా తేరియుఁడు మేలుకొనఁగలఁడు సుమీ !

పు:- అప్పుడు వీరిద్దఱును, ఈయొక్కతెనె మోహింతురు ; ఆనాటకము మిక్కిలి హాస్యరసభరితమై యుండును ; అట్టి

కాకతాళీయసందర్భములు నాకు మిక్కిలి సంతోషదాయకములు.

[శీలినియు లవచంద్రుఁడును బ్రవేశింతురు.]

లవచంద్రుఁడు:- నేను నిజముగా మోహపరవశుఁడను గాననియు వెక్కిరించుట కిట్లు నటించుచున్నాననియు నీ వేల తలంతువు ? హేయతకును వెక్కిరింపులకును నిజమైన కంటినీటికిని సంబంధ ముండదు. చూడవా ! నే నొట్టు పెట్టుకొని మోహపరవశుఁడ నైనపు డెట్లు నాకన్నులు నీరు గార్చుచున్నవో ? అట్టిపుట్టుక గలయొట్టులు వట్టి బూటకము లెట్లులగును ? ఈగుఱుతులు నావిరహబాధను నిజమని నిరూపించుచుండ, నీ కిది వెక్కిరింపుగా నెట్లను మానము కలుగుచున్నదో తోఁపకున్నది.

శీలిని:- నీజిత్తులమారితన మంతకంతకు నొకమెట్టెక్కుచున్నది. పవిత్రతలేని యీగాంధర్వవివాహము లాసురగతులకు దిగుట వింతకాదు; నే నెఱింగినసత్యమునే కాదనుచుఁ గ్రొత్తసత్యాలు పలుకుచుంట సత్యముగ వింతయే. నీ విట్టియొట్టులు హీరామయిం గామించి యామె యెదుటఁ బెట్టుకొనియుండలేదా ? ఆమె నిపుడు వదలిపెట్టఁదలఁచితివా ? ఏమి ? పూర్వము చేసినప్రమాణములు తూనికలో నిప్పుడు చేయుచున్న ప్రమాణములకు సరిపోవునెడల, నీగౌరవమునకు శూన్యతయే కలిగి పోవునుసుమీ ! ఆమెను వరించినతఱి నీవు పెట్టుకొన్న

యొట్టులు, ఇప్పుడు నాయెదుట నామీఁదమోహావేశముం జూపుచుఁ బెట్టుకొనుచున్న యొట్టులును దులలోఁదూచినచో సమానములే యగును; లేక, రెండును శూన్యతుల్యములేనై మాయామయము లగుకట్టుకథలు కావలసివచ్చును.

లవ:- ఆమెతో నపుడు ప్రమాణములు చేసినప్పుడు నాకు జ్ఞానశక్తిగూడ శూన్యమై యుండెను.

శీ:- ఇపుడు నీ వామెను విడుచుటలోను, నాయభిప్రాయమునుబట్టి, నీకు జ్ఞానశక్తి సున్నయే.

లవ:- ధామాత్రేయుఁ డామెను మోహించియున్నాఁడు; ఆతఁడు నిన్ను వరింపఁడు. స్పష్టము.

(ధామాత్రేయుఁడు నిద్ర లేచును)

ధా:- ఓహో! శీలినివా? దేవతవా? అప్సరసవా? ఈశ్వరుని పూర్ణశక్తివా? నీనయనములకు నుపమానమే దొరకకున్నది; ఏనీలమణులకుం బోల్చిచూతమన్నను, అన్నియు హేయపృథివీజన్యములేగాని, నీనయనతేజఃప్రాధాన్యము కలవి కావు. ముద్దులుమూటఁగట్టునీయధరములమధురసుధ యాపండినబింబముల కెట్లబ్బును? తెల్లదామరరెక్కల చక్కఁదనమును మించునీచేతులం జూడ నాతార లంటుహిమనికాయము మాలకాకివలె నల్లగఁ గాన్పించు; ఈశుద్ధావదాతవర్ణంపురాణిని, ఈయానందసముద్రమున్రిను, ఒక్కసారి ముద్దుపెట్టుకొందునా?

శీ:- అయ్యో ; ఎట్టిహేయదశ సంఘటించెను ! మీరందఱుం గూడఁబలుకుకొని నన్ను వెక్కిరించి పరిహాసింప సమకట్టితిరా, ఏమి ? మీకు నైతికనాగరకతయు మర్యాదలు నున్నచో, నన్నిట్లు వెక్కిరింపులతోఁ బరియాచకము లాడుదు? మీరు నన్ను, యథాపూర్వము నేనెఱింగినట్లు, తిరస్కరింపరాదూ ? అందుసకుబదులు మీరుభయులు నిప్పుడు వెక్కిరింతల మోహావేశములం జూపుదురా? నాకన్నులకుం బురుషులవలె నున్నను, మీరు నిజముగఁ బౌరుషవంతులేని, నాబోటిమర్యాద గలకన్య నిట్లు సామాన్యనుగాఁ దక్కువచూపు చూచుట సంభవించునా ? ఒట్లతో, సత్యప్రమాణములతో నాయందచందములనెందును లేని సౌందర్యమున్నట్లతిశయోక్తులతో వర్ణించుట, మీయుభయులతిరస్కారభావములకు నలవాటుపడియున్న నాయెదుటనా ? హ్రీమయిని మోహించుటలో మీరుభయులు నెట్లుసమానస్కంధులై యుంటిరో, అట్లే, యిప్పుడీశీలిని హేలనచేయుటలోను దగినయుజ్జీలుగ నున్నారు. నాబోటియమాయికకన్యకుం గన్నులనీరు గారిపించి వేధించుటలోనా మీయీవెక్కిరింపులనేరుపు ; ఆభిజాత్యము గలయేపురుషుఁడును నాబోటిపవిత్రకన్యను వేళంకోళముచేసి, ఆమెసహనశక్తుల యంత్యావధుల నావేశపఱచి, ఇట్లు హాస్యనాటక మాడి వినోదింపఁడు.

లవ:- నీకు దయ యెంతమాత్రమును లేదు, ధామాత్రేయా! నీకిది తగదు. నీవు హ్రీమయిని మోహించియున్నావు

గదా! ఇద్ది నే నెఱుంగుదునని నీకును దెలియును; ఇఁక నామనఃస్ఫూర్తిగా, నిండుస్నేహభావముతోనే, నే నా హీరామయిని నాభావపథమున నేలవభాగము నుండ నీయను. శీలినిమీఁది మోహభారమును సర్వమును నాకు వదలివేయుము! ఈశీలిని నేనే మరణపర్యంతము వరింతును.

శీ:- వెక్కిరించుటలో నింతటికంత శోషపడినమానవులను జూచి యెఱుఁగ.

ధా:- లవచంద్రా! నీహీరామయిని నీవే వరింపుము; నాకు వద్దు. ఇదివఱ కొకవేళ నేఁబొరపాటుపడినను ఆమాయామోహావరణము నన్ను వదలినది. ఆమెమీఁదిప్రేమ యతిథివలె దినమాత్ర ముండెనేమో; కాని, ఇప్పుడు నాస్వగృహమును నేఁజేరినట్లు, శీలినిం జేరి స్థిరనివాసముం గాంచినది; ఇఁక మాఱదు.

లవ:- శీలినీ! ఈతనిమాటల నమ్మకుము.

ధా:- నీ వెఱుఁగఁజాలని నాభావముల లోతును దృణీకరింపకుము; అథవా, నీ కనుభూత మగునపుడు పశ్చాత్తపించెదవుసుమీ!

[హీరామయి ప్రవేశించును.]

అదిగో! అటు చూడుము, నీ ప్రాణప్రియను. నీ మోహిని యచ్చట నున్నది.

హీ:- అంధకారబంధుర మగునిశీథిని నయనేంద్రియశక్తి నపహరించినను, శ్రవణేంద్రియశక్తుల చుఱుకును

హెచ్చించును. నేత్రశక్తులకు బాధకలిగించినందునకుం బ్రాయశ్చిత్తముగా వీనులసత్తను రెట్టించును. ఓలవ చంద్రా! నాయీక్షణములకు నిన్ను వీక్షించి గుఱుతు పట్టఁగలసామర్థ్యము లేకుండెను. కాని, నీధ్వనిని గుఱుతు పట్టిన యీనావీనులకు నే నెంతయుం గృతజ్ఞురాలను. సరే; కాని, న న్నట్లచ్చట నిర్దయుఁడవై యొంటరిదానిం జేసి యేల వదలివచ్చితివి ?

లవ:- నామోహపాశము లన్యత్రి నన్ను గుంజుచుండ నే నేల నీపజ్జ నుందును ?

హేమ:- లవచంద్రుని నేమోహిని నాప్రక్కనుండి యాకర్షింపఁ గలదు ?

లవ:- అచ్చట నిలువనీయని లవచంద్రుని మోహినియే; ఆప్రకాశించు సమస్తతారలసౌరును మించి యీనిశను వెలిఁగించినశీలినియే. ఇఁక నన్ను వెదకఁబనిలేదు. నీ మీఁదఁ గలిగిన తిరస్కారబుద్ధియే నిన్నట్లు వదలునట్లు చేసినదని యిఁకనైన నమ్ముము.

హేమ:- ఈనీమాటలు నీతలంపుల ననుసరించి వచ్చుటలేదు. ఇట్టిమా ర్పసంభవము.

శీ:- అదిగో! ఈపెయు నన్ను వేళంకోణము చేయుచున్న ముఠాలోనిదే. ఇప్పుడు దెలిసిపోయినది. వీరు ముగ్గురుం గలిసి నన్ను గేలిసేసి విసికించి బాధింపఁ బన్నిన పన్నాగ మిది. బాధింపఁబూనిన మోహినీమయూ! కృతఘ్ను

తమా! నీవే వీరితోఁగూడి నన్ను హేళనము చేయుదువే? మన కుండిన స్నేహమంతయు, మనరహస్యాలోచనముల ఫలమంతయు, మనసోదరీవాత్సల్యప్రమాణపర్యవసానమంతయు, మనముభయులముం గలిసి మెలిసి తిరిగిన గంటలపంట యంతయు, మన మన్యోన్యము నెడఁబాయ లేక పరితపించిన వింతబాధ యంతయు నింతలోనే నీవు మఱచి, యిట్లు పరిణమించుట యెంతవింత! ఒకబడిలోనే కలిసి చదువుచుం బసితనమునం దెంతయమాయికలమై యుంటిమి! మనమిద్దఱమును ధరాదేవతలవలెఁ గలిసి కుట్టుపనిలో నేర్పుఁజూపి యొక్క కుసుమమునే గూర్చుచుంటిమి; ఒక్క కుసుమపుగురినే కాంచుచుంటిమి; ఒక్క పరుపుమీఁదనే చేరుచుంటిమి; ఒక్క రాగము నొక్క తాళముననే యాలాపన చేయుచుంటిమి; మన చేతులుం బ్రక్కలుం గంఠస్వనములుం జిత్తములును భిన్నవ్యక్తుల వనుటకు వీలులేకుండఁగాదె! ఒక్క తొడిమెకుం బుట్టిన రెండుజంటపండ్లవలె విడిగాఁ గొన్పించియు నైక్యమునొంది, హృదయ మొక్కటియేయై, మకుట మొకటియేయై పుంస్త్రీరూపములతో నొప్పారెక్కుంపుసొంపును మించి నాతో ద్వైతభావమే లేక కలిసి పెంచఁబడిన నీవు, చెలికత్తెల కుండుసనాతనప్రేమంపుబంధములం దెంపి యీయమాయికవర్తనము గలనీచెలికత్తెను వెళంకోణము చేయుచున్న పురుషులతోఁగూడి నీవే యిట్లు హేళనమునకుం బూనెదవటే! చెలిమి కిది తగదుసుమీ!

వధూమణుల కిది తగినవిధము కాదుసుమీ! నేనే కాదు, ఇపుడు నాదియే యనుభవము, కాని, మనస్త్రీజాతియంతయు నీతప్పును విన్నచోఁ దప్పక నిందింతురుసుమీ!

హీం:- నీకనికరంపుటుపన్యాసమునకు నా కచ్చెరు వగుచున్నది. నీయెడ నాకుం దిరస్కారదృష్టి లేదు; కాని, నీనుడులలో నాయెడ నీకున్న హేయత వ్యక్తమగుచున్నది.

శి:- నిజమును దాచిపెట్టిన లాభములేదు; నన్ను వెక్కిరించుటకై నన్ను వెన్నంటితిరుగు మనుచు, నాముఖనయన వికాసములం గొనియాడు మనుచు, నీవు లవచంద్రునిఁ బురికొల్పి పంపలేదో! అక్కాలముననే, నిన్ను వెఱ్ఱెత్తినట్లు మోహించియున్నధామాత్రేయుని, మోహించియున్ననన్ను నెడమకాలఁ దన్నుచున్న యాధామాత్రేయునినే, వింతగా న న్నొకయచ్చెరనుగా నొకదివ్యదేవతనుగా నసరాదా! ప్రస్తుతింపుమని పురికొల్పి పంపినజాణవు నీవుగాదో! అట్లు నీతంత్ర మీవింతమార్పు కాకున్న, క్షణమునకుం బూర్వమే హేయతమభావముతోఁ జూచినస్త్రీని వింతగ నింతలో నిట్లుకొనియాడుట యెట్లుసంభవించు? ఒక ముహూర్తమాత్రము గడవనిదే, నిన్నే ప్రాణతుల్యనుగా భావించినలవచంద్రుఁడు నిన్ను విడనాడి నట్లభినయించుచు నన్నే మోహించునట్లు నటింపనేల? ఇదియంతయు నీజాణతనపు వేళంకోణముకాకున్న మఱి యేమనఁదగు? నీవంటి సొగసుగత్తెను, నీవంటిచక్కనిచుక్కను, నీవంటి లోకాకర్షణసమర్థురాలిని, నీవంటియదృష్టవతిని, నేను

గాను, మిక్కిలి దురదృష్టవంతురాలనుగూడ ; కాని, నేను మోహింపనిపురుషుఁడు నన్ను వెంబడించుట యెంతపింత ; నీవు దీనింగూర్చి నన్ను మఱింతతిరస్కరించుట తగునా ? మనయన్యోన్యపూర్వస్నేహముం గూర్చి మన్నించి, జాలి చూపవలయునుగాని, ఈవెక్కిరింత తగునా ?

హె:- నీ పీసూటిపోటిమాట లేయభిప్రాయముతో నను చున్నావో నే నెఱుంగఁజాలను.

:- ఆఁ ! యెంతటిజాణవే ! వేళంకోళపుఁబట్టును వదలవుగా! ఆ రతిపీక్షణములం బూర్తిగా నభినయింపుము ; నే నటు పీపు తిప్పినవెంటనే నన్ను వెక్కిరింతువుగాని ; వార లతోఁ గన్నుసన్నలం జేయుదువుగాని; మీకు మనోహర ముగఁ దోఁచిన యీహాస్యవైఖరిని సాగింపుఁడు; ఈమీ హాస్యరసపురసపుష్టిదాయకశక్తినిఁ గవీశ్వరులుం జారిత్రి కులుం గొనియాడితీరుదురులెండు ; నిజముగా మీకు నిసుమంతజాలిగాని, కరుణాలవముగాని నడవడిలో నుండ వలసిన యేకొంచెము మంచితనముగాని, శేషించియున్న చో, న న్నిట్లు వదరునట్లుచేసియుండరు ; కాని,— ఇఁక సెలవుపుచ్చుకొనెద ; దీనికంతకును నాలోపంపుదుర్మోహ చింతయే కారణమై యుండు; ఆలోపమును నామరణమో తుద కపసరణమో చక్కఁబెట్టవలసియున్నది.

లవ:- దయామయీ ! శీలిసీ ! అంతగాఁ దొందరపడకుము. నావిన్నపమును మన్నింపుము, నామోహంపుఁబరవ

పదమా! నాప్రాణసమానా! నాజీవసమాన వగు నో సుందరాంగీ!

శీ:- ఓ! నాట్యరసము మితిమీఱుచున్నది!

హీ్రా:- (లవచంద్రునితో) ప్రియతమా! అట్లామెను దిరస్కరించుట తగదు.

ధా:- ఆమె నిన్ను బతిమాలఁజాలదేమో? కాని, నేను బలిమితో వంచఁగలను, సుమీ!

లవ:- ఈమె బతిమాలుట యెంతవ్యర్థమో, నీబలిమియు నంత వ్యర్థమే! ఈయబల వేఁడికోలులును, నీబలిమితోడి బెదిరింపులును వ్యర్థతలోఁ దుల్యములే. (శీలినితో) శీలినీ! నిజమును వినుము; నీమీఁద మోహాలత పూర్ణముగ నల్లుకొన్నది; నాప్రాణముతోడుసుమీ! నీకొఱకై యీనాప్రాణమునే తృణీకరించి యీనానూతనమోహ మసత్యమనునీతనితో ద్వంద్వయుద్ధమునకు సన్నద్ధుఁడ నగుచున్నాఁడ.

ధా:- (శీలినితో) ఆతనిమోహమునకంటె నామోహమధికతరమని నొక్కి వక్కాణించుచున్నాఁడ.

లవ:- (ధామాత్రేయునితో) నీ వామాటమీఁద నిలుతువేని తోలఁగిరమ్ము; ద్వంద్వయుద్ధమే సత్యమును బరిష్కరించును.

ధా:- వెంటనే; రమ్ము; లవచంద్రా!

హీ్రా:- లవచంద్రా! దీనిపర్యవసాన మేమికానున్నది?

లవ:- పో ! పోవే ! సిద్దీముద్దరాలా !

ధా:- (లవచంద్రునితో) అట్లనుట తగదు ; తగదయ్యా ! విచ్చలవిడిగ మాటలాడుచున్నావు ; నీకు హ్రీమయి మీఁద మోహము లేకపోవుట యెట్టియసత్యమో, నాతో ద్వంద్వయుద్ధమునకు నీవు సిద్ధపడుటయు నంతటియసత్యమే ! కావుననే, కదలిరావు, సుమీ ! పొమ్ము ; నీ వొకపిఱికిపందవు.

లవ:- (ధామాత్రేయునితో) గొంతునొక్కఁగలనులే ; పిల్లీ! నడచిసాగుము. తెగఁబడిననీచకీటమా ! విషంపుటాశీవిష మునువలె నిన్నుఁ జీచ మడఁచి పారవైచిరానా ?

హ్రీ:- నీ కిట్టివాక్పారుష్య మెట్లుకలిగినది. ? ఇది యెంతవింత మార్పు ! ప్రియతమా ! లవచంద్రా !

లవ:- (హ్రీమయితో) నీ కిఁకఁబ్రియుఁడనా ? పో, పో ; మంగళివెంగలీ ! విషరసనా ! తొలఁగిపొమ్ము.

హ్రీ:- ఇది హాస్యముకాదా ! లవచంద్రా !

ధా:- అవును, హ్రీమయీ ! నీ వేదియు నెఱుఁగవుకాదూ !

లవ:- ధామాత్రేయా ! నామాటకు నే వెనుదీయువాఁడను గాను ; రమ్ము.

ధా:- నీ కుండువాగ్దానములందలి నిర్లక్ష్యము నా కున్న నెంతవీలో నాకును గలుగుచుండెడిది ; నీమాట నమ్మ నొకకు వీలులేదు.

లవ:- ఏమందువు ? ఈపెను దెబ్బకూడఁగొట్టి హానిఁగలిగించి నెట్టవలెననియా, లేక, చంపి పంపవలెననియా, నీయభిప్రాయము? ఆమెమీఁద నాకుఁ బ్రేమ లేకున్నను, నే నామె కట్లు బాధకలిగించువాఁడను గాను.

హ్రీ:- నన్నుఁ దిరస్కరించుటకంటె నెక్కువగుహాని మఱియేది ? నిరసించుటయే నన్ను ? ఏకారణముచేత ? ఎట్టి చిక్కులు నాకుఁ గలుగుచున్నవి ! ప్రియతమా ! ఈక్రొత్తవింతకు హేతుజాత మెయ్యది ? నేను హ్రీమయిని గానా ? నీవు నిజముగ లవచంద్రుఁడవు కావా ? ఇదివఱకు నా కున్న సౌందర్య మిప్పుడు తక్కువ కాలేదే! రాత్రివఱకు నీమోహ మమోఘమైయుండె ; కాని, ఈరాత్రియే నన్ను వదలి వెడలిపోయితివి ? ఏల వెడలితివో ? నాకులదేవతలు నాకోరికకు భంగమును గలిగింపరుగాక ! రాఁబోవుసుఖాతిశయమును హెచ్చించుట కిది బయానాకాఁబోలు నందునా ?

లవ:- నాప్రాణసాక్షిగా నిన్ను వదలిపెట్టితిని ; నీమోహము నీమీఁదఁ జూడఁదలంపే లేదు. కావున, నీయాశ వదలుకొనుము, నీప్రశ్నలఁజాలింపుము, నీసంశయమును విడిచిపెట్టుము. నిన్ను వదలుట నిజమని నమ్ముము ; ఇంతకంటె సత్యతరము మఱియొకటి యుండదు ; ఇది వేళంకోళపు మాట కాదు ; నిన్నుఁ దిరస్కరించితిని ; శిలినిని వరించితిని.

హే:- (శీలినితో) ఎంతటిహానిఁ జేసితివే ? ఓగాఁరడిదానా ! ఓకుసుమములోని పురుగా ? ఓమోహంపుదొంగా ! ఏమి ? రాత్రి వచ్చి నాప్రియతముని హృదయమందలి ప్రేమధనము నపహరించితివిగా ?

శీ:- వహవ్వా ! నిజముగా నీతీక్ష్ణత నేమనవలయును ? నీకు లజ్జయు బిడియమును లేవా ? కన్య కుండవలసినకట్టు నెఱుంగవా, ఏమి ? నామర్యాదయుం గనికరమును గల వాక్కునుండి తీక్ష్ణప్రత్యుత్తరములను బెకలింపఁ దలంపు కలదాయేమి నీకు ? ఛీ ! పో ! పో ! పోవే, నంగనాచీ ! పో ! తోలుబొమ్మ.

హే:- తోలుబొమ్మనా ? ఏల ? ఆఁ-తెలిసినది ; నీయూహాపోహలు ? నీవు పొడుగరివి ; నేను బొట్టిదాననని తిరస్కరించుటయా దానియర్థము. తెలిసె ; నేను బొట్టిదాననని లవచంద్రునికిం దెలిపి, ఎట్లో యీతనిమనస్సును ద్రిప్పి తనమీఁద మోహావేశము నతనికిఁ గలిగించినది; నేను బొట్టిదానననియా నీజిత్తులు పన్నుట. ఓరంగులు పైచినవసంతోత్సవపుబొంగా ! నేనెంతపొట్టియో చెప్పుము. నీకన్నుల నానఖములతో గిల్లఁదగినయెత్తు నాకున్నదో లేదో చూతునా ?

శీ:- మీరు నన్ను వెక్కిరింపఁబూనితిరని తెలిసియు మిమ్ముల వేఁడుచున్నదానను ;—ఈమె నాకు హానినిఁగలిగింపకుండ దయచేసి కాపాడుఁడు. నన్నిదివఱ కెవరును శపించి యుండలేదు. వదరుబోతు తగవులలో నాకు నేర్పులేదు.

నా కిది పిఱికితనముగ నున్నను, అన్నలమిన్నల కది తోడవే. ఆమెను నన్నుఁ గొట్టనీయకుఁడు. నాకంటెం బొట్టిదియని మీా రనుకొని నే నామెతోఁ బోరాడుటకు మించినయుజ్జీనని యెంచెద రేమో? అట్టిదానను గాను.

హీ్రి:- తిరిగి, ఆమాటయే? పొట్టిదానవా? వినుఁడీ.

శి:- హీ్రిమయీా! నీవు మంచిదానవు. నామీాఁద నింత యాగ్రహము వద్దు. హీ్రిమయీా! నీకును నాకును జిరకాలపుటానుకూల్యము కలదు; నారహస్యముల నీతోఁ జెప్పుచుండనా? నిన్నెపుడైన లేశమైన బాధించి యుంటినా? ఈయొక్క విషయమునం దక్క ధామాత్రి యునిమీాఁది మోహావేశముచేత మఱచి నీ వీగడచిన రాత్రి యీవనమునకుం బారిపోవుటంగూర్చి మాత్రము ముచ్చటించితిని; ఆతఁడు నీమీాఁదిమోహముచేత నిన్ను వెంబడించెను; ఆతనిమీాఁదిమోహాటోపవివశనై నేనును వెంబడించితిని; ఒకముహూర్తముకిందటివఱకు నన్ను బెదరించియు, నదలించియుఁ, గొట్టుదునని బట్టదరి చూచి యుం జంపుదుననియు గద్దించినవాఁడే. ఇఁక నాతప్పును నేనే సవరించుకొనుటకై నాకాలికి బుద్ధిచెప్పి తిరిగి మన నగరమునకు, నీవు నన్నుఁ బోనిచ్చినచోఁ దిరిగి వెడలుదును; నీవెంబడి నే నడుగిడను. నన్నుఁ బోనిమ్ము.నాస్వభావము నీనాసౌమ్యవాక్కులతోనే గమనింపవచ్చు.

హీ్రి:- పోవచ్చును; ఏమి? నిన్ను నాటంకపఱచువార లెవరు?

శీ:- నే నిచ్చట వదలిపోవలసివచ్చిన బుద్ధిలేనియీయామెదయే నాకు బాధకము.

హేఁ:- ఏమి ? ఈ లవచందు్రినిమీఁద నే

శీ:- కాదు ధామాత్రేయునిమీఁద

లవ:- (శీలినితో) శీలినీ ! భయపడిపారిపోకుము. ఈమె నీకు నెట్టి హానియుం జేయఁజాలదు.

ధా:- (లవచందు్రినితో) నీవుకూడ నామెపక్షమున నిలిచి నను, శీలినికి నెట్టిహానియు రానీయను.

శీ:- ఓహో ! ఆమెకుఁ గోపావేశము కలిగెనేని, ఆమె తీక్ష్ణతకు మితియే లేదు ; ఆమెబడిలోఁ జదువుదినములలోఁ జూపినవక్కజిత్తులను గోపతాపములను నే నెఱుఁగనా ? ఆమె పొట్టిదియైనను, బుట్టెఁడుజిత్తులపుట్ట. ఆమెకోపమునకు మేము భయపడుచుంటిమి.

హేఁ:- (శీలినితో) అదిగో ! తిరిగి యాకూఁతయే ! పొట్టిదానను నీచురాలనో ! (పురుషులతో) ఆమె న న్నట్లు నిందించుచుండ మీ రుభయులును జమత్కారమును జూచుచుండురా ? ఆమెతోఁ గలియఁబడనిండు.

లవ:- (హేఁమయితో) ఓసి, మరుగుజ్జుదానా ! నీవీడ వదలకున్నదేల ! కాలు సాగనీయనిగడ్డిదుబ్బువంటి పొట్టిబిడ్డా ! రుదా్రక్షపూసా ! పో, పొమ్మ్మ.

ధామా:- (లవచందు్రినితో) ని న్నేమాత్రమును గామింపనియామెయొక్క పక్షమునంగూడి వేల వదరెదవు ?

శీలినిజోక్యము నీ కేల ? శీలినిపే రెత్తకుము. నీ వింక మీఁద శీలినిమీఁద నెట్టిమోహలేశమును జూపినను, నీవు తరువాతఁ బశ్చాత్తపింపవలసివచ్చునుమీ !

లవ:- ఇప్పుడు నన్నీహ్రీమయి యాకర్షించుట లేదు. నీకు నిజమైనపౌరుషమే యున్నయెడ నాతోడ ద్వంద్వయుద్ధముచేసి గెలిచి, తరువాత శీలిని నీవాక్రమము ; అంతవఱకు నీకును, ఆమెతో జోక్యమేల ?

ధామా:- సాగిరమ్ము ; సందేహ మేల ? బాహాబాహి, ముష్టాముష్టి పోరియే నీపని పట్టెదను ; కదలి రమ్ము.

(లవచంద్రుఁడును ధామాత్రేయుఁడును నిష్క్రమింతురు.)

హ్రీ:- ఓసి ! జాణా ! ఈచిక్కంతయు నీవు కలిగించినదే వలదు ; పోకుము.

శీ:- నే నింక నిన్ను నమ్మఁబోను, నే నింక నీదుష్టసాంగత్యమును క్షణమాత్రమును గోరను. నీచేతులకు దురద ముదిరి పెనఁగులాడుటకుఁ దొందర బలిసినది ; నాకాళ్ళును బొడవులై పారిపోఁ దొందరించుచున్నవి.

(నిష్క్రమించును.)

హ్రీ:- నా కీవిచిత్రపరిణామములం జూడ వింతచింత హెచ్చుచున్నది ; ఏమియుం దోఁచుటలేదు.

(నిష్క్రమించును)

[భైరవుఁడు ప్రవేశించును]

భైర:- (పుష్కరునితో) ఇదియంతయు నీనిర్లక్ష్యముచేతనే; చూచితివా, పెడత్రిరిగినది; నీవు మీఁదుమిక్కిలి బుద్ధిపూర్వకముగాఁగూడ నీకొంటెచమత్కారములను జేయుచున్నావో, లేక, యిది నీపొరపాటులపరంపరయో తెలియకున్నది.

పు:- (భైరవునితో) నామాట నమ్ముఁడు, పిశాచపతీ! నేను నిజముగాఁ బొరపాటు చెందితిని. మనయర్ధనిశాపురివారు ధరించు వస్త్రవేషములంబట్టి నన్ను గుఱుతుపట్టి యీసుమరసమును బ్రయోగింపుమంటిరిగదా! మీరు చెప్పినట్లే మనపౌరుని కనురెప్పలమీఁదనే పూసితిని; ఈవిషయమున నాయందేతప్పును లేదుగదా! కాని, ఇరువురుపౌరు లీయడవిలో నుండుటచే, వ్యవహారము బెడిసి, కావలసిన సవతులపో రొకచమత్కారపుఁబ్రహసనముగా నాకు వినోదమును గలిగించెను.

భై:- నీవు చూచుచున్నావుగదా యీవినోదపరంపరను? ఈ మోహితు లుభయులును ద్వంద్వయుద్ధమును జేయసమకట్టి వెడలినారుగదా! పుష్కరా! నీవు వెంటనే బయలుదేరి మబ్బులతో నిబ్బయలు కప్పివైచి, చుక్క యొక్కటియైనఁ గానరానట్లు చేసి, నరకకూపంపుఁజీఁకట్లు గ్రమ్మునట్లు చేయుము; ఈయుభయుల నొకనితో నొకని సంధింపనీయకుము; లవచందురునికంఠస్వరము నభినయించుచు ధామాత్రేయునిఁ జెడఁదిట్టుచును, మఱియొకతఱి

ధామాత్రియునివలెనె యఱచుచును, వీరి నుభయులను బెడత్రోవలకు నీడ్చుచు, విసికించి విసికించి, నిద్రావశులం జేసి, అపరస్మృతి యనఁదగు నిద్రాముద్రకు వీగిపాదాది కర్మేంద్రియముల లొంగించి భద్రపఱచి, నీయుక్తిశక్తులం జూపుము; తరువాత నీమూలికారసమును లవచంద్రుని నేత్రములమీఁదఁ బూయుము. ఈరసశక్తి పూర్వపుఁ గుసుమసారశక్తికి విఱుగుడై యాతనినయనములకు యథా పూర్వపునైజశక్తులం దిరిగి కలిగించును. వారు నిద్ర లేచుటతోడనే యీపూర్వరంగకథ స్వప్నగాథవలెనె యీజంటలు తిరిగి నగరమువైపు సాఁగి యామరణము మాఱని తీఱనిమారమహిమకు వశ్యులై యుందురు. నీ వీకార్యకలాపమును సాఁగించులోపల నాతిధన్యకడ కరిగి తిరిగి నా కాహిందుబాలకుని వశపఱచుమని బెదరించి, దానికనురెప్పలమీఁదిరసదోషమును దొలఁగించి, శాంతి గలిగించి వైచెదను.

పు:-భూతనాథా! ఈపని తొందరతోఁ గావలయు. ఏలన, రాత్రించరగణములవేగ మీమేఘములఁ బాఱఁదోలిన వెంటనే, అనూరునికాలరి యగునుషఃకాంత తనకాంతు లతో బయలువెడలి, పిశాచభూతగణములఁ జెల్లాచెద రుగఁ దోలివైచును; అంతట నాభూతములు శ్మశాన సమాధిభూజముల దాగికొనును; అప్పుడే చతుష్పథ నివాసు లగుభూతములు తమతమపురుగుల పరపులం జేరుచున్నయవి. దినకరుకాంతుల కివి వెఱచివెఱచి నక్కు

చుండును ; భూతపిశాచములకును నిశాచరులకును నిశ
యే శయనానుకూలనిశాంతముగదా !

భై:- మనవంటి భూతసేనాపతులసితిగతులు వేఱుకదా ! మా
కును దివాకరుని యుదయకిరణములకును నెయ్యమే గాని
కయ్య మెప్పుడును లేదు ; వేఁటాఁడు నాటవికునివలె
సమస్తవనములను దోఁపులను బూర్వదిగుదధితీరంపునీల
హరితవీచికాడోలికల నరుణకిరణుఁడు సువర్ణ వర్ణ వైఖరికిం
దెచ్చువఱకు నిచ్చవచ్చునట్లు నచ్చెరువుగ విచ్చలవిడిఁ
దిరుగసమర్థత మాకుఁగలదు. ఈమాట నిజమైనను, మన
కిత్తఱి చిత్తమువచ్చినట్లు కాలయాపనముచేయసమయము
కాదుసుమీ ! తొందరపడి పనిచెడనీయక యుదయము
గాకముందే మన కార్యసాఫల్యమును గూర్చుకొనవల
యునుసుమీ ! (నిష్క్రమించును)

పు:- (తనలో)

ముం దొకయడుగుఁగ్ వెనుక కొకడుగుఁగ్
దొందర కలుగఁగఁ దుద కే తోఁవను
దప్పఁగఁ దిప్పెదు దబ్బరగొంతుల ;
నెప్పరి సేవని నెవ రెఱుఁగరు నను.

భూతములారా ! వీరిని గలఁతనొందించి త్రిప్పుఁడు.
ఇద్దఱిలో నొకఁ డిటు వచ్చుచున్నాఁడు.

లవ:- అహంకారీ ! ధామ త్రియా ! ఎక్కడ నున్నావు ?
పలుకవేల ?

పు:- (ధామాత్రేయుని కంఠస్వరముతో) ఇక్కడనేరా! దుర్మార్గుఁడా! ఒరనుండి కత్తిని దూసి యుద్ధమునకు సిద్ధముగ నున్నానురా! నీ వెక్కడ నున్నావు?

లవ:- సూటిగ నడచి నీతోఁ గలియఁబడుదును.

పు:- (ధామాత్రేయునివలె) నాతో సమభూమికి సాగిరమ్ము, శౌర్యంబున్న॥

(లవచంద్రుఁడు పుష్కరుని మోసపుఁగంఠస్వరమునుబట్టి సాఁగి నిష్క్రమించు.)

[ధామాత్రేయుఁడు ప్రవేశించును.]

ధా:- లవచంద్రా! తిరిగి పలుకవేమి? ఓరి పిఱికిదొంగా! పరుగెత్తిపోతివిరా? ప్రత్యుత్తరము లేదేమి? ఏపొదరింట దాగితివి? నీతల నెక్కడ మక్కువతో దాపఁదలంచితివి?

పు:- (లవచంద్రునికంఠస్వరమును బూని) ఓరి పిఱికిపందా! ఆకసంపుంజుక్కలతోనా నీబింకంపుటహామికలు! ఈపొదలతో నీలేతసొరకాయల నఱకుదువా? రావేమి? మోసగాఁడవు; కావుననే కదలిరావు. వెఱ్ఱికూనా! ఈచేతికఱ్ఱ చాలు ని న్నొకదెబ్బతో వంచుటకు! ఛీ! నీవంటిబాలిశునిపై ఖడ్గయుద్ధ మేల?

ధా:- అట్లో, అక్కడనుండియా నీగములులు?

పు:- నాపలుకు ్రయలికిడి విని, సాఁగి రమ్ము సమభూస్థలికిని.

(నిష్క్రమింతురు.)

[లవచంద్రుఁడు ప్రవేశించును.]

వ:- నాకంటె ముందుసాగుచుం బైఁగాఁ గాలుద్రవ్వుచుండును; ఆతనికంఠస్వరమును విని కాలుసాగించిన తోడనె మాయమగుచుండును; ఈదొంగ నాకంటె వేగముగాఁ బరుగెత్తఁగలఁడు; నేను బహువేగముతో వెంబడించినను, నాకంటెఁ దీవ్రతముగాఁ బారిపోఁగలఁడు; నా కిఁక విసుకుపుట్టుచున్నది; దారి సమముగా లేదు; చిమ్మచీఁకటి బాధించుచున్నది; ఇఁక నడవఁజాలను. (అనుచుఁ బండుకొనును.) ఓ దివాకరా! కరుణామయకిరణజాలమా! నీ వొకక్షణమాత్ర మరుణోదయకిరణముల సాఁగించితివా, నే నాదుర్మార్గుఁ డగుధామాత్రేయునిఁ జిక్కించుకొని కసితీర్చుకొనఁగలను.

(అని నిద్రించును.)

[ధామాత్రేయుఁడును బుష్కరుఁడును బ్రవేశింతురు.]

:- ఓరోరి! పిఱికిపందా! (లవచంద్రునికంఠస్వరముతో) యుద్ధమునకుఁ గదలి రావేమిరా!

ా:- ధైర్యమున్నచో, సాహసించి నిల్వఁబడుము; నాకు నీపిఱికితనము స్పష్టపడినది. ముందు పరుగెత్తుచు నెచ్చోటను జిక్కక, ఎదుట నిల్వఁబడఁజాలవు, కన్నెత్తిచూడ లేవు. తిరిగి యింతలో నెక్కడ నక్కినావురా?

:- (లవచంద్రుని గొంతుతో) ఇటు రమ్ము; నే నిక్కడనే యుందును.

ామాత్రే:- కాదు, కాదు, ఈ వెక్కిరింపుల కొక్కిరితనము నీకుం దగదనుమీ! దీనికిం దగినశాస్తి నీకుఁ దప్పదు.

ఉదయముకాఁగానే నాకంటఁబడితివా, నీపనిపట్టెద. ఇప్పటికిం దప్పించుకొంటివి. నాకు నలసటగా నుంటచే నీ చల్లనిచోటనే కాళ్ళు పారఁజాచి పండెద. ఉదయము కాఁగానే నిన్ను వంచఁగలను. (అనిపరుండి నిద్రించును.)

[శీలిని ప్రవేశించును.]

శీలిని:- (తనలోనే) ఎట్టి విసికించురాత్రి యిది! గడియ సాఁగినట్లు కానరాని దీర్ఘరాత్రముగదా! ఓ దీర్ఘనిశాపిశాచమా! నీ వెపుడు తొలఁగుదువు? ప్రాక్సతీముఖముం జూడనిచ్చి మాకు సుఖములం గలిగింపవా? దివాకరా! ఉదయ మగుటతోడనే నానగరముం జేరెద; నీకనికరమే నాకు శరణము; ఈదుర్మార్గులపోరు పడఁజాల; వీరివేళం కోణముల సహింపఁజాల. నిద్రాదైవతమా! నీవే యొక్కొక్కతఱి చిక్కులనుండి తొలఁగించుదేవతవు. ఈనా దుష్టపరిచయస్థులనుండి కొంతసేపైనం గాపాడవా?

(అని పరుండి నిద్రించును.)

పు:- ఇంకను జిక్కినది ముగ్గురే; నాల్గవవ్యక్తి దొరకవలయును. ఇద్దఱు స్త్రీలు; ఇద్దఱు పురుషులు నగుదురు. ఇదిగో, నాల్గవవ్యక్తి వచ్చుచున్నది. ధూసరాలకములం దూలుచు దుఃఖమును జాటుచున్నట్లున్నయది.

గీ. మదనసముఁ డగుగజదొంగ మఱి గలండె?
ముదితలను బేల్చి కొల్చెడిమూర్ఖుఁ డితఁడె.

[హీ్రమయి ప్రవేశించును]

హ్రీ:- క. ఇంతటివిసుకును దుఃఖము
నంతకునిలయుంపుఁబొంత లందుదు నాకో?

వింతగఁ గురిసెడి మంచిది
చింతల హెచ్చించె ముండ్లు; జేనేఁడు కదలన్.
క. కోరికలు గుంజుచున్నను
బారఁగ లే వీపదములు వానికి సరిగాఁ
జేరగిలఁ బడుదు నిచ్చట
సూరుఁడు కన్నడిడివఱకు సూర్యుఁడె కాచున్.

భాస్కరదేవా! ద్వంద్వయుద్ధము సంభవించెనేని,నీవే నామనోహరునిఁ గాపాడ సమర్థుఁడవు.

(అని పరుండి నిద్రించును)

పు:- (ప్రవేశించి పాడును,)
నేలమీఁదఁ బండుఁడీ - నిజపుశాంతి నిద్రదే
కాల మొక్కతీఱు గాదు; కష్టముల్ స్థిరంబులే!
(లవచంద్రుని రెప్పలమీఁద రసంబును బిండుచు)
ఆరసమును విఱుచు నిద్ది; హార్దదోష మణఁచుచున్
ఈరసంపుమహిమచేత హితముఁగాంతు వోవరా!
నిదురలేచి వెంటనే నీదుమది తిరంబుగాన్
బదిలముగ సువిదితమైన పత్నిగతిగఁ బొందుమా!
పల్లెటూరిమోటుపలుకు భళి యనంగ సాఁగెడున్
ఎల్లవారు వారిసతుల హితులుగాఁ దలంపరో!
క. ఇత్తఱిమోసం బుండదు
చిత్తములను మార్చి రసము చీకా కడఁపన్
మొత్తనిమడు లలవడఁగాఁ
గ్రొత్తసుఖా లెప్పుడుఁ బొందఁగోరరె వీరల్?
(నిష్క్రమించును.)

# నాల్గవయంకము.



## —* మొదటిరంగము *—

[ అడవిలో దంపతిద్వయము నిద్రించియుండును. త్రిధన్వయు, భూతబుద్ధియుఁ గొన్నిభూతములు సేవించుచుండఁ బ్రవేశింతురు. భైరవుఁ డదృశ్యుఁడై వెనుక నిల్వఁబడును.]

త్రి:- (గర్దభముఖముతో నున్నభూతబుద్ధితో) వచ్చి యీ పూలపాన్పుమీఁద దయచేయుఁడు. నీమనోహర మైన చెంపలు (ముద్దుపెట్టుకొనుచు) ఎంతమృదువుగా నున్నవి! కస్తూరివాసనల వెదచల్లు నీపాటలసుమంబుల నీ నున్నని శిరోజముల నలంకరింతుఁగాక! నీయందము లైనశ్రవణము లెంతముద్దుగా నున్నవి ?

భూ:- బటాణిపువ్వు కనఁబడదేల ?

బటాణిపువ్వు:- సంసిద్ధుఁడనై యాజ్ఞకు బద్ధుఁడను.

భూ:- నాతల గోకు. సాలెపురుగువల యేఁడి ?

సాలెపురుగువల:- ఇక్కడనే హాజరై యున్నాను.

భూ:- నీవు నీయాయుధములతో బయలుదేరి, యెఱ్ఱనితొంట్లతోఁ గాలు తుమ్మెదను నీనేర్పుమీఱ నదియున్న గోరంటపువ్వుతోఁగూడఁ దీసికొనిరమ్ము ; వేగమ

పొమ్ము. ఒకతేనెతెట్టెనుగూడఁ దీసికొనిరమ్ము. నీసంగత
మున నెక్కువరభసము చెందక వేవేగ నీపనిని సాధించి
రమ్ము; తేనెతెట్టెను దుంపులుచేయక జాగ్రత్తతోఁ
గొనితెమ్ము. తేనెను నీపైనఁ జిందించుకొని తడిసితివేని
నాకు నసహ్యపడవలసివచ్చును. ఆవగింజ యెక్కడ?

ఆవగింజః- హాజరుగా నున్నాను.

సూ.- నీహస్తము నందఁజేయుము. అంతటి యతివినయమును గట్టిపెట్టుము.

ఆవగింజః- తమయాజ్ఞను సెలవిండు.

సూః- అయ్యా! మరేమియు లేదు, గాని, సాలెపురుగు వలతోఁ గలిసి, గోకుటయే. అయ్యా! నేను క్షౌరముచేయించుకొనవలయు; నాముఖముమీఁదఁగూడ వెండ్రుకలు పెరిగియున్నవి. నాగాడిదపిల్ల కోమలత్వమహిమ యేమనుకొన్నారు? కొంచె మొక వెండ్రుకకు గిలిగింతకలిగిన, గోకుకొనక తప్పదు.

త్రిః- ప్రియతమా! కొంచెము గీతగానము నాలకింతువా?

భూః- నాకు గానమన్న సయుక్తిక మగునుత్సాహ మెక్కువ కలదు; పల్లెటూరిమద్దెల మొదలగు వాద్యవిద్దెలం జూపింపుఁడు.

త్రిః- ప్రియతమా! మీ కేయాహారపదార్థములు రుచియో సెలవిండు.

భూ:- నిజముం జెప్పనా ? నా కొకబుట్టెఁడుగడ్డియు వట్టి నివ్వ రులును గావలయు ; మంచినివ్వరిగడ్డికి సాటియే లేదు.

త్రి:- నా సేవకభూతములలో నొకసాహసాతిశయము గల భూతము కలదు ; అది పోయి యుడుతలు దాచిపెట్టుకొను గింజలను గొల్లగొట్టి యాగింజపప్పులను మీఁకుం దెచ్చి యీయఁగలదు.

భూ:- నా కొకగుప్పెఁడో రెండుపిడికిళ్లో బటానీలం దెప్పించినం జాలును; కాని, నాకు నిద్దురముబ్బుగా నున్నదిగాన, నీసేవకు లెవ్వరును నాచెంతకు రాకుండున ట్లాజ్ఞ చేయుము.

త్రి:- నీవు నిద్రింపుము ; నాకౌఁగిటం గప్పి నిన్ను నిద్రపుచ్చెదు. (భూతములతో) సేవకభూతములారా! తొలఁగి నలుదిక్కులకుం బొండు. ఇట నిల్వకుఁడు (భూతము లన్నియుం బారిపోవును.) ఇట్లే మావిగున్నకు గురువింద తీఁగె యల్లుకొనును ; పొగడచెట్టున కిట్టులే కాశీరత్నంపుఁ దీఁగె యల్లుకొనును. (భూతబుద్ధినిఁ జూచుచు) నీమీఁది మోహజలధికి నవధియే లేకున్నది. (నిద్రింతురు.)

[పుష్కరుఁడు ప్రవేశించును.]

శై:- (ముందునకు వచ్చి)పుష్కరా ! స్వాగతము ! ఈవింత మోహపుమహిమను దిలకించితివా ? పాపము ! దీని వెఱ్ఱి మోహంపుఁ జేష్టలం జూడ నాకే జాలికలుగుచున్నది. కొన్ని హోరలకు ముందు, పాపము ! ఈపె కెత్తిన పిచ్చి

మోహావేశమును గాంచితిని ; ఈమూర్ఖుని యనుగ్రహమును గాంక్షించుచుండ, నేను వెక్కిరించి యసహ్యపడి, తిరస్కారవాక్యములం బలికితిని. ఈవ్యర్థశిఖామణి ఫాలముమీఁది వెండ్రుకలు కానరాకుండ సుమహారమును నెత్తిమీఁద దిగవైచి చూచుచుండెను. ఋతుసహజమగుమంచు సకాలమున నుండుమొగ్గలమీఁదఁ బ్రాచ్యమౌక్తికతుల్యాలంకారమై యొప్పియుం గాలవైఖరి మాఱఁగాఁ జిన్నకుసుమములదళాంచలములనుండి కన్నీరువలెఁ గారుట యెట్లు శోకము నావహింపఁజేయునో, అట్లే యీత్రిధన్యయొక్క ధన్యతమదశ మాఱి యీయధమతమమోహతమఃకళంకపంకిలమై యుండఁ జూచువారలకుఁ జాలికలుగదా ? నాకసిదీఱ వెక్కిరించి, పొగరణఁగినదని తెలిసికొని, నేను మొదటఁ గోరియుండినభారతీయబాలుని నావశము వెంటనే చేయుమంటిని. వెంటనే యంగీకరించి యొకభూతమునకు నొప్పగించి నా భూతాధిపమందిరమునకుం బంపించెను. నాపంత మంతయు నెఱవేఱినది కావున, దీనినేత్రములం గ్రమ్మిన యీ హేయమోహదోషముం దొలంగించెద. పుష్కరా ! కనికరించి యీతనిగాడిదెపిల్లతల నూడఁబెఱికివైచి, ఈతని తోడివారు నగరమును జేరునప్పు డీతండును మేల్కొని, ఈయవస్థలన్నియు స్వప్నావస్థలుగా భావించి స్వనగర గృహముం జేరునట్లు చేయుము. మొట్టమొదట నారాణి దురవస్థను బోఁగొట్టుదుఁగాక !

శ్లో. విహాయ మూలికాదోషం యథాపూర్వమతి ర్భవ
నేత్రే స్యాతాం యథాపూర్వం త్యజ మాదనమత్తతామ్

క. రసదోషముఁ బో నీమది
కసహనమోహంపుదోస మళ్లే యడఁగుఁ
గసిలే దిఁక నామదిలో
నసితేక్షణ ! పొందు నేత్రయాథాత్మ్యంబుఁ.

(ప్రక్కనఁజేరి) ప్రియురాలా ! త్రిధన్యా ! ధర్మపత్నీ ! మేలుకొనుము.

త్రి:- నా ప్రియతముఁడ వగుభైరవధీరా ! ఛీ ! ఛీ ! ఎంతటి దుష్టస్వప్నములచేఁ బీడింపఁబడితిని ! తుట్టతుద కొక గాడిదపిల్లనుగూడఁ గోమలమని ధీమలినతచే మోహించితిని.

భై:- స్త్రీలమోహంపుదుర్గతి తెన్నెఱుఁగునె ?

త్రి:- ఈచిత్రస్వప్న మెట్లు సంభవించెనో! ఆగార్దభశాబంపు రూపమును స్మరించినమాత్రమున నా కిపుడు తలవంపు లగును.

భై:- అటువవలదు. పుష్కరా ! ఈతలను దాచిపెట్టుము. త్రిధన్యా ! గానమును సాగింపుము. ఈగానమహిమచే వీరికి నైదుగురకు గాఢనిద్ర కలిగి వీరు స్వనగరముం జేరుదురుగాక !

త్రి:- లాలిపాటలం బాడుఁడు.

పు:- మీరందఱును బూర్వబుద్ధులతో మేలుకొందురుగాక !

భై:- గానము సరసముగ నున్నది. రాణీ! నాకరతలమును గ్రహించి కూడ రమ్ము. పిమ్మట నిద్రించుచోటు నుయ్యేలను వలె నూగించుము. మన ముభయులము గడచినమనస్పర్థలను మఱచి యథాపూర్వప్రేమాతిశయముతో మెలంగుచు రేపటిదేవేశునివివాహమహోత్సవమును దర్శించియందు నాట్యమాడుదముగాక! వారి నాశీర్వదించి వత్తముగాక! ఈదంపతులుగూడ నాసందర్భముననే పాణిగ్రహణోత్సవముల సాగించుకొందురుగాక!

పు:- భైరవేశ్వరా! వినుఁడు, భారద్వాజపక్షి కూయసాఁగినది. నే నిఁక సెలవుగైకొందును.

భై:- అట్లైన, త్రిధన్యా, నిశ్శబ్దముగ మన మీరాత్రి ఛాయల ననుసరించి సాగుదమా! మన కీభూవలయపరిచలన మొక కష్టంపుంబనియా? ఆతిరుగుఁబోతు చంద్రమండలముకూడ మన నందుకొనఁజాలదు!

త్రి:- ప్రియతమా! సాగిపోవుదము, రండు, మార్గమధ్యమున నీరాత్రి జరిగినచిత్రకథలమహిమల సవిస్తరముగ బోధింతురుగాక! ఈమనుజులతోడి సమావేశము నాకుఁ గలిగినందునకు హేతుజాతమును వర్ణింతురుగాక! (నిష్క్రమింతురు. భూతాధిపతి గమనమును సూచించుగానము సాగును.)

[దేవేశశివపాలితాదులు సపరివారముగఁ బ్రవేశింతురు.]

దే:- మీలో నొకఁడు పోయి వేఁటకాండ్రి యొకమీని గొనిరండు. నేను వనగాఢభాగములం బరికించి యుంచితిని;

ఉదయ మిదె యగుచున్నది ; గాన నీమృగయాడంబర మును శివపాలితే తిలకించి యానందింపఁగలదు. పడమటి చరియలోని వేఁటకుక్కల విడిచిపెట్టుఁడు, వానిం బోనిండు; తొందరతోఁబోయి యతని రప్పించుఁడు.

(ఒకసేవకుఁడు పోవును.)

మన ముభయులము నీనగశిఖరభూమిం జేరి క్రింద సాగు నీవింత వేఁటలయందముం దిలకింతము.

శివ:- కతమశ్రీకృష్ణాదుల మృగయావినోదసందర్భములఁ గృత ద్వీపమున సాగుతఱి వారితోనుండి తిలకించితిని ; వారి వేఁటకుక్కలు స్వర్ణదేశపుజాతివి ; ఆవేఁటాడునేర్పు మఱి యెందును గాంచియెఱుఁగను. అచ్ఛటిజలాశయభరితవనం బులు నుపవనంబులు నగంబులు నేల, పుడమియు నాకసం బును బ్రతిధ్వనించుచు వనములెల్లం గల్లోలితంబులై చెలం గుచుండె. రాగవిరహితమయ్యు నయ్యాఖేట మనురాగ జనకమై, స్తనితతుల్యమయ్యు నావేఁటగాండ్రయఱపు మురిపెం బుదయింపఁ జేయుచుండె.

దే:- నావేఁటకుక్కలును స్వర్ణదేశంపుజాతివే. వాని ముట్టెలు, వంకరతోఁకలు, బూడిదెవర్ణము, త్రిదశాలయంపునందుల గంగడోలువంటి వ్రేలాడుమెడతోళ్ళు, వంపుగలమోకాళ్లు, గంటలమ్రోఁతవంటికంఠారవము,- మఱియొకజాతికుక్కర ములకు నుండునా ? మఱియొక్కదేశమునం దీజాతి కాన్పిం చునా ? నీవే చూచి, విని, సత్యమునెఱుంగఁగలవు. కాని,- ఈ కానవచ్చునచ్చర లెవ్వరో ?

రాజు(డు:- ప్రభూ ! ఈచిన్నది నాతనూజయే, నిద్రావశయై యున్నది; ఈత(డే లవచంద్రు(డు; ఆత(డే ధామాత్రేయు(డు; ఆపె శీలినియే. వీరందఱు నొక్కచో నిద్రించుట యొకగొప్పవింత.

దే:- వా రుషఃకాలమున వసంతసంబంధోత్సవముల విహరించు నూహతో లేచివచ్చియుందురు; మనరాకను విని, నిరీక్షించుచుండ నిద్రపట్టియుండును. కాని, అజజా! మన వైచిన విచారణతిథి యిదియేకాదా? నే(డేకదా ప్రేమయి తనయాలోచితనిశ్చితమును ఖచితముగ( జెప్పవలసి యున్నది.

అజ:- చిత్తము; మహాప్రభూ !

దే:- వే(టకాండ్రతో( దమకొమ్మువాద్యముల నూ(ది లేపు(డని నాయాజ్ఞగా( జెప్పు(డు. (వాద్యధ్వనులు సాగ దంపతులు నిద్రలేతురు)

మిత్రవర్గమున కుదయవందనము. వివాహముహూర్తములమాసములును సుదినములును దాటినవేమో! ఈ వన్యవిహంగము లిప్పు డేలొకో దాంపత్యకాంక్షలం జూపుట!

లవ:- ప్రభువరా! నన్ను క్షమింపవే(డుకొనుచున్నా(డ.

దే:- మిమ్ముల నందఱను నిల్వ(బడు(డని వే(డుచున్నా(డను. మీ రుభయులు నొక్కయువతినే ప్రేమించుటచే శత్రువులై యుంటిరిగదా! అన్యోన్యమైత్రిలు లేకయే శాంతు

లై యొక్కచో నిర్ణయించుట యసంభవము; శత్రువులకు మీకు మైత్రియే యసంభవము. పరస్పరసమానమే దుస్సాధ్యమగునో, మైత్రి యెట్లు సంభవించునో! ఇదియంతయు వింతగా నున్నది.

లవ:- నాధారా ! నాకును వింతగ నచ్చెరువే కలిగినది; కాని, యిది నాకు జాగ్రదవస్థయో, స్వప్నావస్థయో, సగము మెలఁకువ, సగము కలయో, నిర్ణయింపఁజాలను; నమ్ముఁడు! ప్రమాణపూర్వకముగఁ జెప్పెద: నే నెట్లీ చోటుం జేరితినో తెలిసికొనఁజాలకున్నాఁడను. బహుశః నే నీస్త్రీమయితోఁ గూడి వచ్చియుందును. మాయుద్దేశము నగరమునుండి పారిపోయి, ఈనాగరశాసనబాధలేని చోటుఁజేరి వివాహమాడక—

అజ:- మహాప్రభూ ! తెలిసె; తెలిసె; దొంగతనము చిక్కిపోయినది. చాలినంతవాఙ్మూలము లభించిపోయినది. మననగరశాసనములఁబట్టి యీతఁడు శిక్షార్హుఁడు.(ధామాత్రేయునితో) ధామాత్రేయా ! వీరుభయులును నిన్నును నన్నును మోసపుచ్చి, పారిపోవ యత్నించిరి. నీ కీమె వాగ్దత్త యగుభార్యయేకదా !

ధా:- ప్రభువరా ! ఈసుందరి, ఈశీలినియే వీరి కుతంత్రముం గూర్చి నాకుం జెప్పఁగాఁ; దీక్ష్ణకోపముతో బయలువెడలి వెంబడించివచ్చితిని ; ఈశీలినియు నావెంబడి మోహపాశబద్ధయై వచ్చినది ; కాని, నామీఁద ననుగ్రహము గల మహాప్రభూ ! ఏవిచిత్రశక్తితంత్రమో నేను జెప్పఁజాల—

నాకు హేమమయిమీఁద నున్నమోహాతామిస్రమంతయు మాయమైపోయి, ఆనాపొరపాటు నాచిన్నతనంపుఁ దెలివి తక్కువగా నిపుడు తోఁచుచున్న దనవచ్చును. నాకీత్తఱి నాపూర్ణప్రేమ, నాజీవితావధి మోహదృష్టి, యంతయు శీలినిపైఁ గీలుకొనిపోయినది. మొట్టమొదట శీలినిం బరిణ యించుటయే నిశ్చితమైయుండఁగా, హేమమయి నాకుం గాన్పించుటచే నట్టియుద్దేశ్యము మఱుగువడి కొంతమోహా భావము చెదరియుండెను గాని, రోగి యపథ్యములం గోరుచు, రోగనివారణకాఁగానే, తనతప్పును దాను దెలిసి కొనునట్లు, నేను నాతప్పును దెలిసికొంటిని; నే నిఁక నెట్టి పొరపాటును బొందక యావజ్జీవము నాశీలినినే మోహిం తును ; ఇఁక ధర్మమునుండి తొలఁగను.

దే:- వధూవరద్వంద్వమా ! మీ రిచ్చట మమ్ము నకస్మా త్తుగాఁ గలియుట యదృష్టవశ మనవచ్చును. (అజజునితో) అజజా ! స్థితిగతులు మాఱుటచే నీయిచ్చకు భంగమును గలిగింపవలసినవాఁడనైతిని ; ఈదంపతిద్వయమునకు మా వివాహసమయముననే దేవాలయమధ్యమునఁ బాణిగ్రహణ మహోత్సవముల జరిపింతును. పొద్దెక్కినకారణముచేత నిఁక మృగయోద్యమమును జాలించి నగరమునకు బయలు దేరుదము. మాదంపతిత్రయమునకు వివాహమహోత్సవ ములు, భోజనసత్కారాదులు సాగించెదము ; రండు. శివపాలితా ! సాగిపోవుదము.

(దేవేశాదులు సపరివారముగ నిష్క్రమింతురు.)

ధా:- ఈజరిగినవింతలు నే నెంత చింతించిచూచినను విదిత ములగుట లేదు ; దూరనగములు క్రిమక్రమముగ ధూమ యోనులుగ మాఱినట్లయినవి.

శ్రీ:- కనుఱెప్పలకు ్రవేలడ్డపడినపుడు వస్తువులన్నియు రెండై గాన్పించునట్లు మన కేమాయయో క్రమ్మి మనచేత స్వప్ననాటకము నాడించినది.

శి:- నాకు నట్లే తోఁచుచున్నది. ధామాత్రేయుఁడు తుట్ట తుదకు నాప్రాణనాథుఁడుగానే, కొంత వింతమార్పు నకుమ వచ్చినను, స్థిరుఁడై నావాఁడై నిల్చినాఁడు.

ధా:- మీకందఱకు నిది స్వప్నముకాదని ధైర్యముచిక్క నదా ? నాకనుమానము పూర్ణముగ వదలలేదు. ప్రభువు వచ్చి మనల నందఱనుగూడ రండని చెప్పిపోవుట నిజమే కదా !

శ్రీ:- నిజ మెట్లుకాదు ! నాతండ్రిగారుకూడ వచ్చియుండిరి కదా ?

శి:- శివపాలితయు వచ్చియుండెఁ గదా !

లవ:- ప్రభువుగారు మనల నందఱను దేవాలయము రండని యాజ్ఞయిచ్చియుండలేదా !

ధా:- అట్లైనచో, మన మాలస్యముం జేయరాదు ; ఇది జాగ్ర దవస్థయే ! ప్రభువుగారివెంటనె సాగిపోవుచు, రాత్రి వృత్తాంతములం బరిశీలింతముగాక ! (నిష్క్రమింతురు).

భూ:- (నిద్రలేచి) మత్తు వదలినది; నాభాగము నొప్పఁజెప్ప వలసినపుడు, నన్నుఁ గేకవేయుఁడు ; నేను రాఁగలను.

నే నింక నొప్పఁజెప్పవలసినభాగ మిది:- "సుందరతముఁడ వగునోవిరామా !" ఏమి ? మీరెక్కడకుఁ బోయినారో ! కిమ్మయా ! శిశునాగా ! ప్లుతా ! చణాటా ! తారాళింగా ! ఈశ్వరుఁడే నాకు శరణము. వీరందఱు న న్నిచ్చట వదలి పారిపోయినారు ! కానిండు. నాయాకల మిగుల విచిత్రముగా నున్నది. ఎంతబుద్ధిశాలియు నిదమిత్థమని యాకలను వర్ణింపఁజాలఁడు. ఈనాకుం గలిగినస్వప్నమును వివరించుటకు యత్నించువాఁ డొకగర్దభ మనవచ్చును. నే నీరాత్రి వచ్చినకలలో నేమార్పును జెందితినో-దాని నెట్టివాఁడును జెప్పకొనసాహసింపఁడు. సాహసించునేని, బుద్ధిలేనివాఁడనవలయును. ఈవింత నెట్టివానినయనమును జూచి(విని) యుండదు; ఎట్టివానిశ్రవణేంద్రియమును విని (జూచి) యుండదు; ఎట్టివానిహస్తమును స్పర్శించి (రుచిచూచి) యుండదు; ఎట్టివానిరసనేంద్రియమును రుచిచూచి (గమనించి) యుండదు; ఎట్టివానిహృదయమును విస్మృతిలేక యనువదింపఁజాలదు. ఈకథనుగుఱించి యొకద్విపదయో పట్పదియో వ్రాయుమని కిమ్మయ నడిగెద. దానికి "భూతబుద్ధి స్వప్నము" అని పేరుపెట్టించెద; నిజముగ నంతులేని భూతప్రేతములంగూర్చినస్వప్నమే యనఁదగు. దానిని నేను మనప్రభువుగారి సన్నిధిలో నాటకాంతమందుఁ బాడెదను. దిశాబిమరణసందర్భముననే పాడుట మంచిదని తలంచెద. (నిష్క్రమించును.)

—* రెండవరంగము *—

[అర్ధనిశానగరము]

[కిమ్మయుని గృహము ; కిమ్మయప్లుతాదులు
ప్రవేశింతురు.]

కిమ్మ:- భూతబుద్ధియింటికి నెవనినైనఁ బంపితిరా! ఆతఁ డింటికి వచ్చినాఁడా ?

తారా:- వానియంతు తెలియనే లేదు. ఆతని కేదో విచిత్ర పరివర్తనము కలిగినది.

ప్లు:- అతఁడు రానియెడల నాటకప్రదర్శనమే చెడి యాటంక మును బొందును. సాగునా ? మఱి సాగదు.

కిమ్మ:- అసంభవమే ; ఈనగరమున నిపు డావిరామపాత్ర నెవ్వఁడు స్వీకరించి ప్రదర్శింపఁగలఁడు !

ప్లు:- మనపనివాండ్రలో సంతటి శేముషీమంతుఁడు మఱి యొకఁడు లేఁడు.

కిమ్మ:- నిజము ! సర్వోత్తముఁ డతఁడే ! ఆతని మనోహర మగువాక్కు సామాన్యమే.

ప్లు:- అసామాన్య మనుఁడు ; నిరుపమాన మనుఁడు. సామా న్యయనఁగా వేశ్యయు నగును.

[శిశునాగుఁడు ప్రవేశించును]

శిశు:- అయ్యలారా ! ప్రభువుగారు వివాహమాడి దేవా లయమునుండి బయలుదేరి వచ్చుచున్నారు. వారితోఁ

గూడ మఱియు నొకదంపతిద్వయము వివాహములాడి వచ్చుచున్నారు. మననాటకము సాగునేని మనపౌరుషము వారియెదుటఁ గొనియాడఁబడునుసుమీ !

పు:- భూతబుద్ధీ ! నీవున్నచో మంచిబహుమతిని బొందుచుం టివిగదా ! ఆతనికిం బ్రభువుగారు తప్పక యాఱుకానుల బహుమతియైన నిచ్చుచుండెను. ఆఱుకాను లొకలెక్కా ! అది యెంతమాత్రము చాలదు.

[భూతబుద్ధి ప్రవేశించును.]

భూ:- మనవారంద ఱేరి ? ఈమనఘనులసంఘ మేది ?

కిమ్మ:- (లేచి యాశ్చర్యముతో) భూతబుద్ధియా ! ఎంతసుది నము నేఁడు ! ఈదినమే సుదినము.

భూ:- అయ్యలారా ! నేను మీకుఁ గొన్నివింతలు వర్ణిం తును. కాని, మీరు నన్ను నెట్టిప్రశ్నలు వేయకుఁడు. అంతయుం జెప్పెద; నాబుద్ధికిం దట్టినట్లు క్రమక్రమముగాఁ జెప్పెద.

కిమ్మ:- ఏవి యావింతలు ! ఏవి ? వినందముగాక !

భూత:- నన్ను గుఱించి కాదు. నే నిపుడు చెప్పున దేమనఁగా మనప్రభువుగారు మాధ్యందినపువిందు నారగించినారు. మీఁదుస్తులు మొదలగువానిని సిద్ధముచేసికొనుఁడు. గడ్డము లతికించుకొనుటకుం జక్కనితాళ్ళు మొదలగు నవి సిద్ధపఱచుకొనుఁడు ; ముఖ్యమైనకబు రేమనః- మన నాటకమునే ప్రభువుగారు కోరినారు. ఎట్లైననేమి ? దిశా

బీకిం జక్కని వలువ లుండవలయును; సింహాపు వేషము వేయునతఁడు గోళ్ళను దీసికొనఁగూడదు. అవి యప్పు డక్కఱకువచ్చునుసుండి. పాత్రిల గ్రిహించుఘునులారా! లశునములనుగాని కలంజములనుగాని దినఁగూడదుసుండీ. అట్లయిన మనముఖములు కౌలుకొట్టి, పెద్దలకు దుర్గంధ బాధను గలిగించును. నేను జెప్పినట్లు మీరందఱును జేసిన చో మనప్రిహాసనమునకుం (వ్యాయోగమునకుం) బేరుకలుగును-ఇఁక వాగుడు వలదు. వెళ్లి సిద్ధముచేయుఁడు పొండు.

(నిష్క్రిమింతురు.)



# పంచమాంకము



[అర్థనిశాపురి; దేవేశుని రాజమందిరము.]

[దేవేశుఁడు, శివపాలిత మొదలగుపరివారము ప్రవేశింతురు]

శివ:- నాదేవేశ్వరా! ఈ దంపతులు చెప్పుమాటలు మిగుల వింతలుగా నున్నవి.

దే:- నిజమని నమ్ముటకు వీలులేనంతవింతగ నున్నవి. నే నిట్టి కట్టుకథలను భూతగాథలను నమ్మను. కామార్తులు, పిచ్చివారును, విషయధ్యానము ముదిరిముదిరి, వెఱ్ఱులెత్తి జ్ఞానశక్తియు క్రియు క్రమముగ నంగీకరించుదానికంటె మింటికంటు నుత్ప్రేక్షలం దగిలికొనుచుందురు. కవులును, వెఱ్ఱెత్తినవారును, కామార్తులును, ఉత్ప్రేక్షాధోరణిలో నొక మెట్టువారే. కామార్తున కొక్కనల్లకోతియు సీతను మించినసతీమణివలె సుందరీమణివలెఁ గాన్పించును. వెఱ్ఱివానికి నరకాదిలోకము లన్నియుం బట్టఁజాలనిభూతవితతి తననికటముననే తోఁచును; కవియొక్క యంతర్దృష్టియు విఱ్ఱవీగి యుత్ప్రేక్షానీరధిలో మునిఁగి తేలుచు స్వర్గమర్త్యలోకముల నొక్కక్షణమాత్రమున నంగలువేయుచుండి, చూడనట్టియుం దలంపఁజాలనట్టియు మిథ్యాజగత్సృష్టి బుద్ధిచేయుచుండ వాగ్విలసనముం దదనుగుణముగ విజృంభింపంజేయుచు నర్థభావనలకు రూపకల్పనలం జేసి మిథ్యావాగర్థంబులకు శబ్దశక్తితో గృహనిర్మాణము చేయు

చుండును; ఆశబ్దజాలమే ఘంటములతోఁగాని యితరలేఖినులతోఁగాని గ్రంథస్థమగును. మేధాశక్తివేధను మించఁగలను. ఏదో యొకయానందమును ధ్యానించి, సంగము దాన హెచ్చి, ఆయానందదాత నొకనిం గల్పించును; రాత్రులం దొకభయకారణముం దలంచినచో, ఒకపొదరింటిని గాంచి భల్లూకమని భ్రమనొందుట యొకవింతయా?

శివ:- వీరిరాత్రివృత్తాంతముల నెంతగఁ దర్కించి విమర్శించి చూచినను, వీరిమనోవికారములపరిణామదశల నెంతపరిశీలించినను, కేవల భావనామాత్రకల్పితకథ యిది కాఁజాలదనియు ఫలీభూతపరిణామమెంతయో పౌర్వాపర్యయుక్తిచే యుక్తియుక్తమై యొప్పుచున్నట్లును, నాకుం దోఁచుచున్నది, కాని, మిక్కిలివింతగ నుండి సంతోషాంతముగఁ బరిణమించినది.

దే:- దంపతిద్వయము వచ్చుచున్న దిటు,
సొంపుగ సుఖసంపన్ముఖవిలసనక

[హేమయాలవచంద్రులును, శీలసిధామాత్రేయులును బ్రవేశింతురు.]

యోగ్యులగుస్నేహితులారా! భగవంతుఁడు సుఖములను మీకు వృద్ధిచేయుంగాక! చిరకాల మీప్రేమాంబుధి నోలలాడుదురుగాక!

లవ:- ఎందెందు నానందకందము మీకును మీసుందరీమణికిని సందడించి విందులంగూర్చుంగాక! విహారముల

నాహారసమయములందును, శయ్యావిహారభావములందును నానందమే హెచ్చి మెచ్చుగలిగించుంగాక!

దే:- ప్రకృత మనుసరింతము; ఈమూఁడుగంటలవిసుకును గసరివైచుటకు నేనాట్యనాటకప్రదర్శనములం గూర్చితిరి? సూత్రధారి యెచ్చట నున్నాఁడు? మన మిట దర్శించు వింతలు విచిత్రములు నేవేవి? ఏనాటకప్రదర్శనమును సిద్ధముకాలేదా? ఈగంటవిసుకును గడపుటెట్లు? విలాస తాత్రి యెందరిగె?

విలా:- వీరాగ్రేసరా! దేవేశా! ఇదె, వచ్చినాఁడను.

దే:- ఈసాయంకాలము నేకీతి నేయుపరూపకప్రదర్శనముతోఁ గడపఁగల్గుము? చెప్పుము. ఏబొమ్మలాటయో, ఏగానసభయో, ఏభాణప్రదర్శనమో, యున్నంగాని, యీజాము గడపఁజాలము.

విలా:- ఈపట్టికలో నేఁజేసిన యేర్పాటు లన్నియుం బేర్కొనఁబడియున్నవి. దేవరవా రెయ్యది మొదటఁజూపవలయునో యానతిండు. దాని నారంభింతుము.(పట్టిక నందఁజేయును.)

దే:- (చదువును) "శరభములతోడి సమరము నొకనాగర హెగ్గడి వీణతోఁ బాడి వినిపించును" సరె; ఇది మా కవసరములేదు. దీనిలోని యుపేంద్రశ్రీకృష్ణమహిమం గూర్చి నాప్రాణేశ్వరి యెఱింగియే యున్నది. (తిరిగి చదువును)

"త్రిగుఁబోతులు శివమెత్తి ధారాదేశాగతగాయకునిం జంపుట"- ఇదియుం జూచినవిషయమే; దివస్ఫుర

విజయానంతరము వీక్షించిన వ్యాయోగమే యిది; వలదు-
(తిరిగి చదువును)

"నవావరణదేవతలు భారతీయకళాదారిద్ర్యమును గూర్చి విలపించుట"- ఇది యొకప్రహేళిక. సవిమర్శమే, సభావమే, కాని, ఈనిషేకమహోత్సవసమయమునకు విరసమగునుగాని, సరసము కాఁబోదుగదా! వలదు—
(తిరిగి చదువును)

"విరామదిశాబీలసమావేశ మను వ్యాయోగము." హాస్యరసము వీరరసమును బుష్కలమై యుండును; స్త్రీప్రదర్శనము; విషమపరిస్థితిభరితము. దీనిలో విరసత యుండియు సరసత వెలయునుగదా! ఏమి?

విలా:- ఇంతకొద్దినాటికను నే నెఱుంగను; దీనిలోనే సరసతయు విషమాలంకృతియు నిండియుండును; ఒక్కశబ్దము కూడ సుప్రయుక్తమనుటకు వీలుండదు; ఒక్కపాత్రయు సమంజసమనుటకుం బొసఁగదు; కాని, దుఃఖాంతమే. దీనిలోఁ దుదకు విరాముఁడు మృతిఁజెందును. ఇది హృదయమును నీరగునట్లు చేయును. కాని, హాస్యరసము వెల్లివఱదలై తుదకు నొప్పును.

దే:- దీని నెవ రాడుదురు?

విలా:- ఈనగరపుం బనివాండ్రు; ఇదివఱ కిట్టి సరసక్రియలం దనుభవములేనివారయ్యు మీవివాహసందర్భమునందుఁ దమకుఁ జేతనగునంత తెల్వింజూపి ప్రదర్శింపం గష్టపడి భాగములం బఠించి సంసిద్ధులై యున్నారు.

దే:- అట్లైన దీనినే తప్పక చూడఁగలము.

విలా:- ప్రభువర్యా! ఇది మీరు చూచి మెచ్చఁదగినది కాదు; నేను వినియున్నాను. కాని, మీరు వారిభక్తిశ్రద్ధలకు మెచ్చి, వారి సదుద్దేశమును మన్నించి, మీకుం జేయఁదలంచిన యిట్టిసేవకు హర్షించునెడలం దమచిత్తము!

దే:- తప్పక చూడఁదలంచితి. భక్తిశ్రద్ధలతోఁ జేసినదేదియు వ్యర్థముకాఁజాలదు. పోయి, వారిని రమ్మనుము. (నారీమణులతో) మీస్థానముల నధిష్ఠించి కించిత్కాలము తిలకింపుఁడు. (విలాసవతి నిష్క్రమించును)

శివ:- దురవస్థలలో నున్నబీదపనివాండ్రను వారికిం జేతఁగాని పని కల్పించి బాధించుట నాకు నిష్టమైనకార్యము కాదు; వారు విహితకృత్యమని యసాధ్యకార్యముం జేసి సమర్థింపలేకపోవుటచే మఱికొంత మనశ్చింతను హెచ్చించుట సంభవించును.

దే:- మధురవాణీ! నీ కట్టిమనస్తాపము కలుగఁబోదు.

శివ:- విలాసవతి వారి కీనాట్యప్రదర్శనాదులు బొత్తుగా నలవాటులేని కార్యములని చెప్పియేయున్నాఁడుగదా!

దే:- వారు చేతఁగాక నేర్పు లేశమును లేక చేసినప్రదర్శనమును మన మోపికతోఁ జూచి మెచ్చుకొ టచే మనకరుణార్ద్రత వ్యక్తతరమగునుగదా! వారి పొరపాట్లనే మన్నించి మెచ్చుకొనుటయే మనము ప్రేక్షకులమై యు

పేక్షచేయక యోపికతోఁ జూచుట కాఁబోవుచున్నది. విహితకృత్య మనుస్వధర్మదృష్టితో వా రాకార్యమును నేర్పుతో నెఱవేర్పఁజాలకున్నను, వారిభక్తిశ్రద్ధలు నేర్పు చేతఁ గాకున్నను, భక్తిబలముచేతనే మన మెప్పును బడయఁజేయఁగలవు. అనేకపర్యాయములు నన్నాదరింప వచ్చుపండితులును, భయముచేత నేమియుం దోఁపక, పప్పులోఁ గాలువేయుచుందురు; పూర్వదినములం దెం తయో కృషిచేసి పఠించిన దానినే నాయెదుట నోట నొకమాటయైన రాక క్రిందుమీఁదగుచుఁ గావలసినన్ని నట్లు పోవుటయేకాక స్వాగతమన్నమాటనుగూడఁ దుదకు మఱచిపోవుచుందురు. నామాటను నమ్ముము; ప్రియ దర్శినీ! వారిమానమునే స్వాగతముగా భావించి మెచ్చు కొనుచుందును. భక్తిశ్రద్ధలతో నొప్పునడఁకువనే వదరుఁ బోతుల వాక్పటిమకంటె విలువకలదిగా నే భావించుచుం దును. శ్రద్ధాభక్తులు ప్రేమతోఁగూడికొన్నచో మౌన ముద్రతోనే సుభద్రవాక్కుల మహిమను జూపునని నాయభిప్రాయము.

[విలాసతాత్రి ప్రవేశించును.]

విలా:- చిత్తము, ప్రభువరా! ప్రస్తావకుని రమ్మనియనుట కుం దమదయాదృష్టితో నానతి నిత్తురా?

దే:- ఆతని రమ్మనుము. (వాద్యములు సాగును.)

[కిమ్మ్రయుఁడు ప్రస్తావనను బ్రారంభించును]

ప్రస్తా:- నేర్పుమీరఁగ మెప్పింప నేర మయ్య !
యోర్పుతో మీరు మాలోని యూడిగంపు
నిర్మలం బగుభక్తిని నెమ్మదులను
గర్మనై పుణ్యమని యెంచి కావవలయు.
మాకు లేదయ్య నేర్పు ; సన్మానకాంక్ష
పోక మీసన్నిధిం జేరి పూజ్యవిద్యఁ
జూపఁబోవుటె క్రొత్తప్రస్తుతపుఁబనియ ;
కోప...దృష్టినిఁ జూపక ... కొంచెమైన
తెలివి... తేటల మాభక్తి తీరు నెంచి,
యలవికానట్టి పనియైన, హర్ష మొంది,
మెలఁగ వేఁడెదఁ దడవేల ? మేలమంత,
విలసనం బున్న లేకున్న, విద్యఁజూపు.

దే:- వీనికిం బూర్ణవిరామమజ్ఞానము పూర్ణశూన్యము.

లవ:- ఎట్లో క్రొత్తగుట్టము కదము నేర్చునట్లు నట్టునట్టుగ గట్టెక్కించినాఁడు ; ఎక్కడ నాపి చదువవలయునో వీఁడెఱుంగఁడు.

మాప్రభువరా ! విశుద్ధనీతిజ్ఞులు వీరు;- రానట్టి లేనట్టి తెల్వితేటలం జూపనొల్లరు ; సత్యదృష్టిం దప్పరాదన్న నీతిని వీరినుండియే నేర్చుకొనఁదగు.

శివపా:- ఈతనిప్రస్తావన పసిబిడ్డచేతిపీణెవలె నెట్లో యొక శబ్దాడంబరము చూపినది ; వాగర్థసంపద శూన్యమైన నేమి ?

దేవే:- దీని యొప్పుగింత వరుసతప్పునిగొలుసువలె నున్నది; శబ్దలోపము కలుగలేదుగాని, అర్థస్ఫురణమే సున్న. తరువాత నెవఁడు వచ్చును?

[ విరాముఁడు, దిశాబీ, గోడ, వెన్నెల, సింహము - పరివేశముకాఁగా ]

ప్రస్తావన:- ప్రభువులార! మాయాటలోఁ బటిమలేమి
సభను దిలకించి మాపల్కుసత్య మరసి
మీరు మన్నించి యీక్షింప మెఱుఁగుసుండి.
ధీరుఁ డితఁడు విరాముఁడు దిశబి యీమె.
కారుసున్నంపుఁబూఁతతోఁ గడువెలుంగు
పూరుషుం డీతఁడే గోడపుష్టిఁజూపు
వీర లీగోడపగులులో వింతప్రేమఁ
గోరికలుతీరఁ జూపంగఁ గోరినారు.
తాఱుమాఱుల నెంచక తాల్మిఁగనుఁడి;
కోరికలు తీరఁ జాలవో గుసగుసలిట.
వెన్నెలం జూప నీతఁడే వెలుఁగుదివ్వెఁ,
జిన్నపొదకంచె, శునకముం జేతఁబూను;
మీ రెఱుంగుఁడు వీరలు పారిపోయి
చేరఁజూతురు నైనసుగోరిపరిక్క;
భీకరం బగుసింగంపువీరరసపు
సోకుఁ జూపెడు నీతఁడు సుదతిఁ గాంచి;
బెదరి పారుచు దాగెడుబీబి దిశబి;
గదుర రక్తంపురంగు లాగరితచీర

వచ్చి చూచి విరాముఁడు వగచి వగచి,
గుృచ్చి సింగంబుఁ గత్తితోఁ గూళఁ జాపి
యంతమే లేనిదుఃఖాన నతఁడె చచ్చుఁ;
గొంతతడవైన దీశాబి చెంత కరిగి,
వింతచావులఁ గాంచుచుఁ జింత హెచ్చఁ
బంతమునఁ గత్తిఁ బొడుచుకొం చంతమొందు.
దీనియితివృత్త మియ్యది; దీనులమని
లేని తెల్వికి మన్నింతు రేని జాలు.

(ప్రస్తావకుఁడు, దిశాబీ మొదలగువారు నిష్క్రమింతురు)

దే:- ఈసింహముకూడ మాటాడునేమోయని యచ్చెరువగు చున్నది.

ధా:- దాని కచ్చెరువేల? ఇట్టిగాడిదలు వాగుచుండ నొక సింహము మాటాడుట వింతయా?

గోడ:- ఈచిత్రింపుఁ జూళికలో గోడయొక్క భాగమును బ్రదర్శించుట నావంతైనది; నాపేరు శిశునాగుఁడు. ఈ గోడ పగులుద్వారమున విరామదిశాబీలు రహస్యముగ మాటలాడుకొనుచుండిరి. ఈసున్నంపుఁబూఁతయు నీరాయియు నేను గోడకుం బ్రత్యామ్నాయముగ నుందు ననుటకుం జిహ్నములు. నిజ మంతయే; ఈఛిద్రమే గోడ లోనిపగు లనుకొనుఁడు.

దే.- సున్నము మొదలగునచేతనము లింతకంటె బాగుగ నెట్లుమాటాడఁగలవు?

ధా:- ఇంతవింతయగునద్దమును నే నెందును బ్రదర్శనమునం జూచియుండలేదు, ప్రభూ !

దే:- మాటాడకుండుఁడు ; విరాముఁడు గోడసమీపమునకుం జేరుచున్నాఁడు.

[విరాముఁడు ప్రవేశించును.]

విరా:- ఓ బెట్టిదంపుఁజూపులరాత్రి ! ఓనల్లనిరాత్రి ! ఓపగలు లేనప్పుడు కాన్పించురాత్రి ! ఓనిశా ! ఓనిశా ! అయ్యో ! అయ్యో ! దిశాబీ తనవాగ్దానమును మఱచునట్లు నీవే చేసితివా ? ఓగోడా ! ఆమెతండ్రియింటికిని నాగృహమునకును హద్దుగ నుండునోయందమైనకుడ్యమా ! నీలోనిపగు లేదియో చూపుము ; నాకు గుసగుసలాడ వీలుంగలిగింపుము. ( గోడ వ్రేళ్ళమధ్యగా ఛిద్రముం జూపును. ) మర్యాదగలకుడ్యమా ! భగవంతుఁడు నిన్ను రక్షించుంగాక ! కాని, దిశాబీ కనపడదేల ? నాయానందహేతువును దాచితివేల? శపింతునుసుమీ ! నన్ను మోసపుచ్చితివేని.

దే:- కుడ్యముకూడ శపింపవలయును గాఁబోలు.

విరా:- (విని) కాదు, ప్రభువరా ! "నన్ను మోసపుచ్చితివేని" అనుమాటలు దిశాబీ యొప్పఁజెప్పవలసినభాగమునకు గుఱుతు. దిశాబీ యిప్పుడు ప్రవేశింపవలయును ; నేను జూచి మాటాడవలయును. అదియే తప్పక మీరు చూడఁబోవుచున్నారు. అదిగో ! వచ్చుచున్నది.

[ దిశాబీ ప్రవేశించును ]

ది:- ఓ దుర్మార్గంపుఁగుడ్యమా! నీవు మా కుభయులకును బ్రతిబంధకమవై నాచింతల హెచ్చించి వించున్నావు. నీరాళ్ళను నే నెన్నిపర్యాయములు ముద్దాడితిని! అయి నను నీకు దయలేదేల ?

విరా:- శబ్దము విన (గాన) వచ్చుచున్నది; నే నిపుడు పగులు దగ్గర నిలిచి, దిశాబీమోమును గనఁ (వినఁ) గలనేమొ చూచెదఁగాక! దిశాబీ!

ది:- ఓనాప్రాణనాథా? ఓప్రియవరా!

విరా:- నీ వేమనుకొన్ననుసరే! నేను నమ్మకము నుంచఁదగిన వరుఁడను; లమంధరుని (లియాందరుని) వంటివాఁడను సుమీ!

ది:- నేనును హీలన్వంటిదానను; ఆమరణాంతము నాప్రేమ యట్లే యుండునుసుండీ!

విరా:- కపాలియుర బ్రికృతియెడ నట్టిప్రేమం జూపఁడను కొనుము.

ది:- నన్ను నట్లే భావించుకొనుము.

విరా:- న న్నీకుడ్యపుఛిద్రద్వారమున ముద్దాడుము.

ది:- నీయధరోష్ఠ మందదు; ఈఛిద్రమునే ముద్దిడుకొం చున్నాను.

విరా: వెంటనే బయలుదేరి నిన్నిగోరీయొద్దఁ గలియుదువా ?

ది:- ఏమిసంభవించినను సరే ! తప్పక వచ్చెద, వెంటనే-

(నిష్క్రమింతురు)

గోడ:- నాశబ్దమంజరి పూర్తియైనది ; ఇఁకఁ నేఁబోయెదను.

(నిష్క్రమించును.)

దే:- ఇప్పుడు వధూవరుల కున్నకుడ్యప్రతిబంధము వదలినది గద !

ధా:- ప్రభువరా ! గోడలుకూడ వినునపుడు, ఇట్టిహద్దులేని వింతల కంత ముండునా ?

శివ:- ఇట్టివెక్కిరింతలమోహపరిణతిని నేను వినియెఱుంగను.

దే:- ఈవిధంపుంబాత్రపుష్టిలో మనకుఁ గానవచ్చునవి పాత్రలు కావు ; అపాత్రంపు ఛాయలే ; ఈఛాయలకు మనభావనచే మెఱుఁగుపెట్టుకొనుటయే హాయి.

శివ:- మనభావనలచేతనే ; కాని, భావములును భావనయును వారికి శూన్యమే.

దేవే:- వారికి వారినిజశక్తులంగూర్చి యున్నయభిప్రాయమున్న కంటె న్యూనతను భావింపమేని, వారిని ఘనులనియే జను లనఁగలరు. వీరింజూడుఁడు. మృగద్వయము మనుజరూపమున వచ్చుచున్నది. కాదు ; వెన్నెలయు సింగమును-

[వెన్నెలయు సింగమును బ్రవేశించును.]

సింగము:- అమ్మలారా ! చిన్నచుంచు నేలమీఁదఁ బ్రాఁకుచున్నను వెఱపుచెందునబలామణులారా ! క్రూరజంతు

వగుమృగరాజు మీయెదుట గర్జించునపుడు మీరు భయపడుదురేమో ! నిజ మేమన:- శిశునాగుడను నేనే యీ సింగంపు వేసమును బూనినాఁడనుగాని, సింహజాతిదికాదీసింహము. నిజమైనసింహజాతిమృగరా జీసభామధ్యమున నున్నచో, నాప్రాణములు దక్కునా ?

దే:- కనికరపుహృదయమును మంచిమనస్సాక్షియుం గల జంతువే.

ధా:- నాదొరా ! నే నింతటిమార్దవము గలమృగము నెన్నడును జూచియుండలేదు.

లవ:- ఈసింగము ధైర్యసంపదలో నొకనక్కకుం బోల్పఁదగిన దనవచ్చును.

దే:- నిజమే, యుక్తాయుక్తవివేచనములో నొకబాతునకుం బోల్పఁదగియున్నది.

ధా:- అట్లేల ? శౌర్య ముండుమృగరాజునకు యుక్తాయుక్త వివేక ముండునా ?

దే:- మన కాగొడవలేల ? ఈవెన్నెలవేసగానిమాటల విందముగాక !

వెన్నెలవేసము:- ఈలాంతరే విదియచందురుఁ జూపుఁగాక !

ధా:- కొమ్ములను నెత్తిన ధరింపవలసియుండెనుగదా !

దే:- అది విదియవెన్నెల కాదు ; గుండ్రనిబింబంపుటంచులో నవి కానరావు.

వె:- ఈలాంతరే విదియచందురుఁ జూపుఁగాక ! ఆలోన నుండుమనుజుండ నేనెగాదా ?

గే:- అన్నిపొరపాట్లలో నెక్కువైనపొరపా టిదే ; మనుజుఁడు లాంతరులోపల నుండవలెంగదా ! లేకున్న, చందమామలోనిమనుజుం డెట్లుకాఁగలఁడు ?

ధా:- లోపలఁ గ్రొవ్వువత్తియుండగా, మనుజుం డెట్లుచేరును ? మఱియొకవింత - చూడుండి ! అది మసి గూడుకట్టినది.

శివ:- ఈవేసముం జూచినవెంటనే విసుకుకల్గుచున్నది.

దే:- ఆవెలుఁగు క్షీణదశయం దుండుటచే బాలచంద్రుఁడని మనము భావించుకొనవలయును. విసుకుపడుట యుక్తమా ! ఈ యఱగడియసేపు వారికి వాగ్దత్తముగదా ! తొందరపడుట మర్యాదకాదు.

లవ:- వెన్నెలవేసమా ! నీచదువు సాగింపుము.

వెన్నెల:- నేఁ జెప్పవలసిన దింతయే- ఈలాంతరే చందమామ ; నేనే యాచందమామలోని మనుజుండను ; ఈ ముండ్లకంచెయు నీకుక్కయు నాయొక్కసామగ్రియే.

ధా:- ఈసంచంతయు లాంతరులోనుండవలెఁగదా ! కానిండు. వినుఁడు ! వినుఁడు ! దిశాబీ ప్రవేశించుచున్నది.

[ దిశాబీ ప్రవేశించును. ]

ది:- ఇదే నిన్నేయొక్క పురాతనసమాధికదా ! నాప్రియు ఁడిరామఁ డేలరాఁడో ?

సింగము:- (గర్జించుచుండును. దిశాబి పారిపోవును)

థా:- నీగర్జ మిక్కిలిచక్కఁగ నున్నదయ్యా !

దే:- దిశాబీ ! అతిత్వరతోఁ బరుగెత్తితివి. శబ్బాష్ !

శివ:- వెన్నెలా ! నీవెలుఁగు బాగుగనున్నది. ఈవెన్నెల వెలుఁగు మనోహరముగ నున్నది. (సింగము దిశాబిచీర కొంగుం బట్టికొనును ; నిష్క్రమించును)

దే:- సింగమా ! చక్కఁగాఁ బట్టుకొంటివి.

థా:- విరాముఁడు వచ్చెను. అతండే.

లవ:- కనుకనే, సింగము పారిపోయెను.

[విరాముఁడు ప్రవేశించును.]

విరా:— చందమామ ! వందనాలు, నీదుచల్లకాంతికై
మందహీనమహితకాంతి నిందు నిపుడు చూపుటన్
అందగత్తె యైనదిశబి నిందుఁజూతు నీదయన్.
సుందరంపునీదువెల్గు సుందరాంగిఁ జూపుఁగా.
కాని ! ఇదేమి గాయంపురక్తము !
అయ్యయో ! ఇదేమి మూడేఁ
గయ్యె మెవ్వఁ డాడెనో !
అయ్యోయో ! యిటుండి చూడు
మయ్య యేమి నాగతుల్ !

క. నయనద్వయమా ! చూచితె ?
ప్రియ కిట్టియవస్థ యెట్లు రేయిం గలిగెన్

బయిటచెఱంగున ఘోరపుఁ
జెయిదపుర క్తంపురంగు! చీల్చె నెవండో!

ఘోరయమకింకరులారా! మీ రయ్యబల కెట్లుహాని యొనర్చితిరి! చేతు లెట్లాడె? నాయాడంబరమునంతటి న స్తమింపఁజేసితిరిగా!

దే:— ఈతీక్ష్ణదుఃఖము, ఇట్టిప్రేమాస్పద మగుప్రియ కిట్టిహాని, యెవనికి మహాబాధ కలిగింపదు.

శివ:— నేను వెక్కిరించితినేమో, గాని, ఈతనిం జూచి నా మనస్సు కరఁగుచున్నది.

విరా:— ప్రకృతిదైవతమా! నీ వేల సింగంబుల సృజియించి తివి; చూడు మీఘోరకృత్యమును, నాప్రాణతుల్య నెట్లీసింగము చంపెనో! హా! అందాన సాటిలేదు; దయకా, యవధియే లేదు; ప్రేమకా, యొకమితియ సున్న; మన్ననకా, నాయన్నులమిన్న కెవరు సాటి? కన్నీరా! కారవేల? కృపాణమా! కృపాపూర్ణ యగు నాప్రియ మాయమైన నీజీవిత మేల? చంపుము నన్నుఁ గూడ (పొడుచుకొనును) చచ్చుచున్నాఁడ! జీవము మింటి కెగసె; నాలుకా! నీ కిఁక వాకు సున్న. వెన్నెలా! నే నిఁకఁ గాంచ నిన్ను. చచ్చితి; చచ్చితి; చచ్చితి; (చచ్చును)

ధా:- సారెకుం జచ్చు టెట్లు? సారె కొనియాడుజూడంపుఁ బాట యిద్ది. ఆసే చిక్కినది వీనికి.

లవ:- ఆసు చుక్కైన లే దిందు. చచ్చినాఁడు. సున్నయే.

దే:- తిరిగి శస్త్రవైద్యుని తెల్వి దిరుగఁగలఁడు.
తుదకు నొకగర్దభంబుగఁ దూఁగఁడో కో !

శివ:- వెన్నెలయుం బోయినది; దిశాబి వచ్చి ప్రాణనాథునిఁ జూడదో కో ?

దే:- వెన్నెల లేకున్నను జుక్కలవెలుంగునం బ్రియునిం గాంచఁగలదు. అదిగో వచ్చుచున్నది.
ఆమె దుఃఖావేదనతో నాటిక పూర్తియగును.

[దిశాబి ప్రవేశించును]

శివ:- పెద్ద యుపన్యాస మిష్టు తగదు; సంక్షేపముగ విలపించి నాటికం గట్టెక్కించునని యెంచెద.

ధా:- ఈ నాయికానాయకులలో నెవరు మెఱుఁగో చెప్పఁ జాలము. నాయకుఁడు దిట్టమైనవాఁడే; నాయికయుం దగినదియే.

లవ:- ఆసోయగంపుఁగన్నులతోఁ దిలకించినది.

ధా:- అదిగో! విలాప మారంభించుచున్నది. వినుఁడు.

దిశా:- నిద్రయా ? ప్రియా ! మృతియే? నాప్రీతికందమా! విరామా ! లెమ్ము. పలుకవేల ? మూఁగవైతివా ? చచ్చితివే? నీనయనములం గప్పుటకు నొకగోరీ తగునే? ఈ పెదవులు, ఈసోగనాసిక, ఈనిద్దంపుంజెక్కులు— అన్నియు సున్నయయ్యెనే ? లోకమందలి దంపతులారా ! ఈ

నయనములకు సాటియే లేకుండెను ; లోకమును దుఃఖ వార్ధిలో ముంచివైచినవి. ఓయమదూతలారా ! మీ రీతని ప్రాణముల నపహరించితిరిగాన, దదర్ధాంగి నగున న్నేల కొనిపోరు ? నానాథునిక్ర్పాణమా ! దయతోవచ్చి నన్ను గ్రుచ్చి ధన్యవగుచు నన్ను ధన్యను జేయుము.

సెలవా నాకిఁక ; సెలవా ? (అనుచుం జచ్చును.)

దే:— వెన్నెలయు, సింగమునా వచ్చి వీరి నుభయులను బూడ్చిపెట్టుటకు.

ధా:— మఱచితిరి. కుడ్యముకూడఁ గలదు.

భూత:— (లేచి) కాదు, నమ్ముఁడు. ఆగోడ వీరిపితృదేవతలకు వీరికిని మధ్యలేదిపుడు. ఇది పూర్తియైనది. భరతవాక్యము నోపికతో దయచేసి విందురా ? లేక, ఒకనాట్యముం దిలకింతురా ?

దేవే:— భరతవాక్యము వలదు ; మీనాటికకు నట్టిది, గట్టిగఁ జెప్పుదును ; అవసరమే లేదు. పాత్రలు రెండును మృతి నొందినపుడు, లోపమెవ్వరిమీఁద వేయుదురు ? పాపము! ఈనాటికను రచించిన కవిశిఖామణియే విరామునిపాత్రను గ్రహించి, దిశాబీయొక్క మొలనూలితో నురిపోసికొని పరలోకగతుండైయున్నచో, మిగుల రసవంతముగ నుండె డిది. ఉన్నదానినున్నట్లు మీరు మీశక్తికొలఁది ప్రదర్శించి తిరి. మీభరతవాక్యాదులు పనిలేదు ; గాని, నాట్యమాడు వారిని వెంటనే రమ్మనుఁడు. (నాట్యము సాగును.)

కలిసతము మగుసర్ధరాత్రిము తన పంజ్రిదుగంటలను గొట్టినది. వధూవరులు పరుండుటకుఁ దొందరపడు వేళ యైనది; రాత్రించరులనడు రేయిపోద్రు. ఇంకను నిద్ర పోనియెడల, రేపు ప్రాతఃకాలమున లేవఁజాలక రాత్రి మేలుకొన్న పెచ్చుకాల ముదయమున నిద్రింతుము. ఈ క్షుద్రనాటికయుం గాలహరణముం జేసినది. మనోహర మిత్రిము లగుదంపతులారా! పోయి నిద్రింపుఁడు. ఒక పక్షమంతయు మావివాహసంబంధమైనవిందులు నుత్సవ ములును సాగఁగలవు. (నిష్క్రిమించును.)

[పుష్కరుఁడు ప్రవేశించును]

కడుపుమంటతో గండుసింగమును
గడుపునిండకే కలుచెడి తోడే
లుడుగక యఱచెడి ఘోరరేయి నిది;
కడుఁగష్టముపడు కాఁపులు మాత్రిము
పడి యలసటతోఁ గడునిద్రింతురు;
చెడ మంచుచుఁ గాఁగడలు కాలుతఱి;
అఱచు నుయూకము పురపరిసరముల;
నరులు వినుచు దీన నశుభ మందురు.

భూతప్రేతము లాతతగతిఁ జను
రాతిరిపొద్దిది; రారు గోరికడ;
మావిహరించెడిమాన్యసమయ మిది
పావనగతి సరసనిశాసతి

యానలఁ దప్పక యామిని మెచ్చుచు
మానుగ మెప్పఁగ మసలుట పగలను ;
దంపతు లిత్తఱి దాపుఁజేరుదురు
సంపద లొప్పెడిసదనం బిది ; సంత
చుంచుమల్లియను జోరగా విందున,
మంచిశాంతి నిట మనుచునుగా వృత
పరిశుద్ధంబుగఁ బరిచారికలకు
సరిగా చుంచఁగ సాగి వచ్చితివి.

[ భైరవుఁడును దీర్ఘదర్శియును బరివారముతోఁ బ్రవేశింతురు ]

భై:- మండపుటగ్నుల మండఁగఁజేయుచు
సుందరగతులను గాంచి మెలంగుఁడు
మందరగతి నీమహితగీతమును
జంపులు త్రొక్కుచుఁ జేరి పాడుఁడిటు.

లి:- గీతరాగమును గీర్వాణముగ గా
నాతతసాధన నందఱుఁ జేయుఁడి
మన మందఱ మీమాన్యగృహస్థుల
మన నెప్పుడు దీవన లొసఁగెద మిఁక.

(పాడుచు భూతతతి నాట్యమాడుచుండ)

భై:- కాపాడఁగవలెఁ గాఁపుగృహంబును
రేపుదయపుఁగిరరేఖలవఱకును ;
ప్రభువును రాణిని విభవము లందఁగ

నుభయులమును గని మొడిచి దీపింతము
దంపతిత్రితయముఁ దగుకీర్తులతో
సంపద లొందఁగ శతవర్షంబులు
సొంపగుమోహాపులంపట నొప్పని
లింపులు విష్ణుగరంపరఁ బోలఁగ.
సకలగుణంబుల చక్కనిసంతతి
వికలత లేకయ వెలిఁగెడుఁగావుత
రాజగృహాంతరపరిభాగంబునఁ
తేజఃపుంజము దిగ్విజయములును
వాజకలిమియును నవారితవిభవము
వెలసెడి నెప్పుడు వీర్యము హెచ్చఁగ
వెలిఁగెడుఁ బ్రభు విట వేలుపసుంబులు.

నాట్యముఁ బూర్తిచేసి పరిచారిక లందఱు నుపాయనములఁ బూర్వమె రావలయును.

(భైరవాదులు సపరివారము నిష్క్రమింతురు.)

పుష్కరుఁడు: (తుదిపల్కును బలుకుచు)

క. మిమ్ముల స్వప్నచ్ఛాయల
నమ్మఁగ మాశక్తిలేశవశగతి నికా-
లమ్ము విసిగించినందున
మమ్ముల మన్నింపుఁడయ్య మతిఁగల యనుచున్.

క. మా నాటకలో లోపముఁ
గానాయకుఁడు మమలనుండి పూజ్యత యొప్పన్
కేనార్యు లఱిత మెప్పుడు
మానామము లిలను బొగడి మెచ్చెద రెప్పుడున్

క. లోపముల దిద్దికొనెదము ;
కోపంబున దుర్విమర్శకుం బూనకుఁడీ ;
చూపుఁడు తప్పుల శాంతిన్ ;
శాపంబుల ఫలము లేదు ; శాంతియ వలయున్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సమాప్తము.



చంద్రికా ముద్రాశాల, గుంటూరు.

# * పుస్తకముల జాబితా *

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| రకామృతసారం | 0 | 12 | చిన్నమ్మకథ | 0 | 4 |
| ద్రాచల రామదాసు చరిత్ర | 0 | 12 | గరుడాచల నాటకం | 0 | 8 |
| కృష్ణవాస్తుశాస్త్రం | 0 | 12 | గయోపాఖ్యాననాటకం | 0 | 8 |
| హస్ఫుటగణితబోధిని | 0 | 12 | ప్రహ్లాద నాటకం | 0 | 8 |
| చ్చరిత్ర ద్విపద | 0 | 12 | ద్రౌపదివస్త్రాపహరణనాటకం | 0 | 8 |
| బాలశిక్ష | 0 | 12 | పూసపాటిశశిరేఖా నాటకం | 0 | 8 |
| ఫ్గుణ అదృష్టదీపిక | 0 | 12 | పురూరవచక్రవర్తికథ | 0 | 8 |
| ఉల- విరాటపర్వ నాటకం | 0 | 12 | జ్యోతిష బాలశిక్ష | 0 | 4 |
| రడపురాణం బొమ్మలతో | 0 | 12 | నవగ్రహ చింతామణి | 0 | 4 |
| చరిత్ర వచనం | 0 | 12 | నీతిశాస్త్రం | 0 | 4 |
| టుపర్వంజంగం | 0 | 12 | ముగ్గులపుస్తకం | 0 | 4 |
| బోధామృతం | 1 | 8 | లంకాయాగం పదం | 0 | 4 |
| జ్ఞాన రత్నావళి | 0 | 12 | లక్ష్మణమూర్ఛ పదం | 0 | 4 |
| ష విద్యాబోధిని | 1 | 0 | వచనకాలజ్ఞానం | 0 | 4 |
| రామాయణ సంగ్రహం | 2 | 0 | హరిభజన కీర్తనలు | 0 | 4 |
| హరిశ్చంద్ర వచనం | 1 | 0 | భగవన్నామ సంకీర్తనలు | 0 | 4 |
| ంగధర నాటకం | 0 | 4 | ఆత్మబోధామృత తత్వములు | 0 | 4 |
| హాళి నాటకం | 0 | 4 | ఆరు వ్రతములు | 0 | 8 |
| మ్మకథ | 0 | 4 | ధర్మాంగదచరిత్ర పాముపాట | 0 | 6 |
| భోజరాజు కథ | 0 | 4 | గంగా వివాహం | 0 | 6 |
| మమ్మకథ | 0 | 4 | సత్యనారాయణ వ్రతం | 0 | 6 |